

# గీత రామాయణము



మహారాష్ట్ర మూలము

రచయిత

శ్రీ గ. ది. మాడ్గూళ్ కర్

ఆంధ్రానువాద కర్త

వానమామలై వరదాచార్యులు




# గీత రామాయణము



మహారాష్ట్ర మూలము

రచయిత

శ్రీ గ. ది. మాడ్గూళ్కర్

ఆంధ్రానువాద కర్త

వానమామలై వరదాచార్యులు

# నివేదన

రామాయణము నెన్నిభాషలలో నెందరెన్నితీర్ల రచించినను ప్రజకు దాని పైనున్న గౌరవము దానియందలి శ్రవణపఠనతృష్ణ చల్లారదనుట అతిశయోక్తిగాదు. ఆకథ యట్టిది. ఆరాముడు ప్రజలకారాధ్య దైవతము. దీనికి కారణము ఆయన ధర్మాచరణము, ఆర్తత్రాణపరాయణత్వమే యనదగును.

యాంతి ధర్మప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతాం
అపంథానం తుగచ్ఛంతం సోదరోఽపి విముంచతి.

అను శ్లోకముగూడ అతని యప్రతిమానమైన ధర్మప్రవర్తనానురక్తిని పశుపక్ష్యాది తిర్యగ్జంతుజాలమునకును నతనియందుగల అనన్యభక్తిని చాటుచున్నది. అట్లే రావణుని యధర్మాచరణమును సోదరునకును నతనియెడ గల విరక్తిని ప్రకట పరచుచున్నది.

ప్రతి కవి రామాయణమును లిఖించుట లైహికాముష్మిక సుఖానంద సంధాయకమని జన్మ చరితార్థమగునని భావించును.

వాల్మీకికి నారదుడు కావ్యరచనమునకు నింతకంటె యోగ్యమగు ఇతివృత్తము లభింపదనునట్లుగా నతని గుణగణముల హృదయాకర్షకముగా వర్ణించిచెప్పెను. ముని పుంగవుడైన వాల్మీకినే నాచరిత్రమాకర్షించిన సామాన్యులనేమన వలెను.

ప్రస్తుతమీ కథ మహారాష్ట్రభాషామహాకవియగు శ్రీగజానన దిగంబర మాడ్గూళ్కరు గారిని యాకర్షించి గేయబద్ధమగు కావ్యమును సుందర పద బంధముతో రసవత్తరముగా వ్రాయునట్లొనర్చినది. ఈ పాటలకు సుధీర్ ఫడ్కే లోకోత్తరమగు సంగీతమును గూర్చి తానజరామర ఖ్యాతిని వహించెను.

# నివేదన

రామాయణము నెన్నిభాషలలో నెందరెన్నితీర్ల రచించినను ప్రజకు దాని పైనున్న గౌరవము దానియందలి శ్రవణపఠనతృష్ణ చల్లారదనుట అతిశయోక్తిగాదు. ఆకథ యట్టిది. ఆరాముడు ప్రజలకారాధ్య దైవతము. దీనికి కారణము ఆయన ధర్మాచరణము, ఆర్తత్రాణపరాయణత్వమే యనదగును.

యాంతి ధర్మప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతాం
అపంథానం తుగచ్ఛంతం సోదరోఽపి విముంచతి.

అను శ్లోకముగూడ అతని యప్రతిమానమైన ధర్మప్రవర్తనానురక్తిని పశుపక్ష్యాది తిర్యగ్జంతుజాలమునకును నతనియందుగల అనన్యభక్తిని చాటుచున్నది. అట్లే రావణుని యధర్మాచరణమును సోదరునకును నతనియెడ గల విరక్తిని ప్రకట పరచుచున్నది.

ప్రతి కవి రామాయణమును లిఖించుట లైహికాముష్మిక సుఖానంద సంధాయకమని జన్మ చరితార్థమగునని భావించును.

వాల్మీకికి నారదుడు కావ్యరచనమునకు నింతకంటె యోగ్యమగు ఇతివృత్తము లభింపదనునట్లుగా నతని గుణగణముల హృదయాకర్షకముగా వర్ణించిచెప్పెను. ముని పుంగవుడైన వాల్మీకినే నాచరిత్రమాకర్షించిన సామాన్యులనేమన వలెను.

ప్రస్తుతమీ కథ మహారాష్ట్రభాషామహాకవియగు శ్రీగజానన దిగంబర మాడ్గూళ్కరు గారిని యాకర్షించి గేయబద్ధమగు కావ్యమును సుందర పదబంధముతో రసవత్తరముగా వ్రాయునట్లొనర్చినది. ఈ పాటలకు సుధీర్ ఫడ్కే లోకోత్తరమగు సంగీతమును గూర్చి తానజరామర ఖ్యాతిని వహించెను.

మొదటి

కవియును గాయకుడును అసాధారణ ప్రతిభాశాలురై తమతమ రంగములలో దేశవిఖ్యాతి నార్జించినారు.

ప్రజానీకము మహారాష్ట్ర దేశమున నింటింట నీగ్రంథము మరియు శ్రీఫడ్కేగారి సుమధుర గానవిలసితములగు రికార్డులు నుంచుకొని చదివి విని యానందసాగరమున నోలలాడుదురు.

ఇట్టి రామాయణము సుప్రసిద్ధ హిందూస్థానీ గవయ్యా శ్రీ ధోండూ శాస్త్రిగారైన నామిత్రులు నన్ను తెనుగున ననువదించుటకు నిర్బంధించుట నా పూర్వజన్మపుణ్యము ఫలించినదని దీని తెనుగు నొనర్చితిని,

ఈ యనువాదమున నాకు విశేషించి మరాఠీ భాషలో పరిచయము లేనందున నాఆప్తమిత్రుడు శ్రీమహంకాళి దత్తాత్రేయ పండితులు అర్జునునకు కృష్ణునివలె తోడుపడి నన్ను విజయవంతు నొనర్చిరి. దీనిని తెనుగున వ్రాయుటకును రేడియోలో ప్రసార మొనర్చుటకును ఆమోదము తెలిపిన మహాకవి శ్రీమాడ్గూళ్కరుగారికి బ్ర॥శ్రీ ధోండుశాస్త్రిగారు దీని కిసంగీతముగూర్చి రేడియో ప్రసారమొనర్ప నుద్యుక్తులైనందున వారికిని నామిత్రుడు శ్రీదత్తాత్రేయులకును నా అనంతకృతజ్ఞతాభివందన లర్పించుచు ఈ మిషతోనైనా రామకథా రచనాభాగ్యము లభించినందులకు నన్నునేనభినందించుకొనుచు ఆంధ్రసోదరులు దీని నాశీర్వదించవలసినదిగా ప్రార్థించుచు విరమింతును.

దీని ముద్రణకై దయతో అంగీకరించిన ఉదార హృదయులు వదాన్య శిరోమణులగు నరాల వంశపయఃపారావార సుధాకరులగు మాన్యశ్రీ వెంకయ్య శ్రేష్ఠిగారికిని వారి కుటుంబసభ్యులకును తానుమాధవుడాయురారోగ్య భోగ భాగ్యములిచ్చి రక్షించుత. వీనిని శ్రద్ధతో సకాలమునకు ముద్రించి యిచ్చిన శ్రీ పబ్బా శంకరయ్యగారికి మిక్కిలి కృతజ్ఞుడను.

"ఇతి శమ్"

ఇట్లు

వానమామలై వరదాచార్యులు.

అనువాదకులు

శ్రీ

# శ్రీ నరాలవంశ చరితము

శ్రీ వేంకటరమణుండిల
శ్రీ వేంకటరమణు డనగఁజెలఁగునరాల
శ్రీ వంశవార్ధిసోముని
శ్రీ వృద్ధినొసంగి రక్షసేయుతసతమున్॥

నరనరమున త్యాగంబును
వరపౌరుషమాత్మగౌరవంబొలికెడి వి
స్ఫుర చరితుఁడు "వెంకయ" యన
తరణంబగు ననిగ్రహాఖ్యుఁడనరె నరాలై ॥

విమలనరాల వంశజుఁడు విశ్రుతపూతచరిత్రుఁ డార్యుఁడున్ ।
సుమహిత వైశ్యరత్నమన శోభిలువాఁడును రాజరామయా ।
ఖ్యమనెడివాఁడు నాతనికి నాత్మజుఁడొక్కఁడు నారయాహ్వయుం ।
డమరయశస్వి సచ్చరితుఁ డార్య విధేయుఁడజేయుడై మనున్.

హరునకుఁ బార్వతికరణిన్
హరికిని శ్రీలక్ష్మియనగ నారాయణునిన్
వరనారీ రత్నంబయి
ధరపయి వీరాంబ సతిగఁదానొప్పారెన్॥

ఆ పుణ్యదంపతులకును
సాఫల్యముగాఁగ సకల సరసగుణాఢ్యుల్
దీపించిరి ముగురాత్మజు
లేపారిరి నాత్మజాతలిరువురు వరుసన్॥

అగ్రజాతుండు రాజారాముడతనికి
రంగారుసతియయ్యె లింగమాంబ
అటులే ద్వితీయుండు నద్వితీయుండయి
బరఁగె వెంకయశ్రేష్ఠి వరగుణుండు
సాధ్వీలలామలు సతి నర్సుబాయియు
కమలాంబ యతనికి కాంతలైరి
రాజయాఖ్యుండును రవివంశ దీపకుఁ
డై చంద్రికళఁగూడి యలరుచుండె

కడుపుపండె రాజయ చంద్రకళలకౌర !
ఐదుగురు పుత్రికలు నల్వురాత్మజులును
నుదయమొందిరి వేంకయ సదయుఁడగుట
తనతనయులంచునెంచుఁ దమ్ముని సుతులను

అక్క భూదేవి చెలియలు ననఘలక్ష్మి
వెంకయశ్రేష్ఠియింటనె వెలయుచుండ్రు
వారలను నన్నదమ్ములవలెనె పెంచి
యాస్తిఁబంచి సమైక్యతనాచరించు

భూదేవి సహనమందున భూదేవియె
స్వగృహమునకు భూదేవతలౌ
సాధువులు ద్విజులు వచ్చిన
శ్రీదేవిగనలరి వారిసేవ లొనర్చున్

కాని భూదేవి కైలాసగతులనందె
లక్ష్మియలరెడి లక్ష్మీవిలాసమొప్ప
ఆమె భర్తయు హనుమాండ్లు అనఘగుణుఁడు
అతనికొక కుమారుఁడు నల్వురనుఁగు సుతలు

వెంకయ్యశ్రేష్ఠిగృహమన వేయునేల ?
అదొక ధర్మసత్రం బెప్పుడాలయమున
కరుగుదెంచెడి యతిథులకవధిలేదు
విసుగుగొనక నెల్లరను సేవింత్రువారి.

ఇంద్రభవనముల్ క్షేత్రములెన్నియేని
వాహనైశ్వర్య వైభవాల్వారలుచున్న
బీడికంపెని మిన్నంటి పెరుగుచున్న
గర్వమెరుగని ఘనుఁడు వెంకయ్యశ్రేష్ఠి.

అరయ నితండుబాధిత హృదంబుజసంతతి కెందుమిత్రుఁడై
మురిపెము గూర్చుటల్ విభుని ముఖ్యవరాంగనలెల్ల తాపమున్
బొరసెడు భూసురాళికిని పొందిక కల్పలతాభశోభలన్
వెరవుగ నీడనిచ్చి పతివీడని ఛాయగ వెంటనుందురా.

మంచిరాలందు నిర్మాణంబొనర్చెను
అలయమ్మను కన్యకాంబకెందు
సావెలలోనొక్క కోవెల నిర్మించె
రాజేశ్వరునకు నైరాణమీర
ఆంజనేయునకు దేవాలయంబు రచించె
నిర్మల సద్భక్తి నిర్మలపురి
వేములవాడలో వెలయు రాజేశుని
పాదుకానిలయంబు పాదుకొల్పె

అటులె కొంగరరావిరాలందునిల్పె, దివ్యగాయత్రిమాతను ద్విజులుమెచ్చ
మంచిరాలలోనన్లే సమంచితగతి, భవ్యభూసురాలయమొండు పాదుకొల్పె

భాగ్యనగరాననొక్క శివాలయంబు
దివ్యగతి ప్రతిష్ఠించి ప్రతిష్ఠగాంచె
అటులె పోచముపాడు రామాలయమున
ధ్వజప్రతిష్ఠతో నిజకీర్తి ధ్వజమునెత్తె॥

హరపాదభక్తులు పరమవిజ్ఞానులు
మల్లయారాధ్యులు మాన్యగుణులు
స్వచ్ఛాత్రి సులభులు బహుయజ్ఞకర్తలు
ఆత్మీయశిష్య చిత్తాపహారి
గురువు వెంకయకిదె గొప్పయంచుదలంచ
అతనికిదీటైన ఆత్మవేత్త
చలిచీమలును గుట్ట చలనమొందని సమా
ధినినిల్చు హరిపదాధీనుఁడెందు

మధురరుతి రామభజనమ్ము మనసుతోడ
గానమొనరించు భక్తాగ్రగణ్యుఁడెపుడు
కలిరహితుఁడవధూత త్రికాలవేది
సాధునారాయణాఖ్యుఁడున్ సద్గురుండె॥

వేంకటరమణాయని యక
లంక ప్రేమమునబిల్చు లలితాత్ముఁడు రా
మాంకితహృదయుఁడె సదయుఁడె
వేంకయగురువనిన ధన్యవిభవుఁడుగాఁడే

భగవదవతారమన కీర్తివడసినట్టి
ప్రథితనారాయణాఖ్య మారాజు కతఁడు
అంతరంగభక్తుండయి యలరుచుండి
భోగియైయుండియును రాజయోగియయ్యె.

రా

ఆ మారాజు సమాధి నొక్కటిని తానత్యంతమౌ భక్తితో
రామాజ్ఞన్ వరగౌతమీ తటమునన్ రాజింపగాఁ గట్టియున్
నేమంబొప్పగ ధర్మశాలలను రెంటిన్నిల్పె తద్వాకకున్
సామీప్యంబుగ వచ్చు యాత్రికులకున్ సౌకర్యమేపారగన్.

సంతతభక్తి నాప్రథిత సాధుమహాత్మునకేటనేటయున్
సంతసమొప్ప పుణ్యతిథిసల్పి సహస్ర మహాన్నదానమున్
బంతులుగాగవచ్చు వరబ్రాహ్మణజాతికి పేదసాదకున్
చెంతగలట్టి గ్రామజనశ్రేణికినిన్ బొనరించు తృప్తిగన్॥

ఆ మహరాజు పుణ్యతిథియందున విందులెకాక సత్ప్రజా
స్తోమముమెచ్చగా చెవికిసొంపగు విందొనరింతుర్రి సత్కథన్
సామమునేలు గానముల సద్భజనన్ పరతత్వభోధలన్
ధీమహితుల్ కవుల్ కథక దేశికులున్ వరగాయకోత్తముల్.

వారికి వేంకయాఖ్యుఁడును వార్షికమై తనరారుచుండగన్
నూరులరౌప్యముల్ మరియు నూతనవస్త్ర బహూకృతుల్ సదా
కూరుచుచుండు రేబవలు కూరిమిమీరగ నట్టిరోజులన్
తారకరామనామ భజనామృతపానమొనర్తుర్రి భక్తులున్॥

అన్నిటికంటె నెంతయును నక్కజమున్ మదిగొల్పుకృత్య మొం
దున్నది వెంకయప్రముఖుఁడొక్కఁడె ఎన్బదివేల రౌప్యముల్
జన్నమునన్వ్యయించి కవి, సాధుల, బీదల పుట్లబియ్యపున్
అన్నము, వస్త్రముల్ మరియు నంచిత దక్షిణలిచ్చె తన్పెఁబో॥

ధనమును త్యాగము భోగ
మ్మునకయి వ్యయమొనరఁజేయు ముఖ్యులలోనన్

మొద

ఘనుఁడీ నరాలవెంకయ
యనుపమ వర్శిఖ్యాతిగాంచె నతుల సుకృతులన్॥

ఈకృతి ముద్రాపకునకు
శ్రీకాంతుఁడు రాముఁడఖిల శ్రీవిభవము ల
స్తోకాయువు నారోగ్యము
సాకల్యము నిచ్చి ప్రోచు శతవత్సరముల్.



# గీతరామాయణము

## గీతసూచిక

## బాలకాండ

మొదట.



## అయోధ్యకాండ



శ్రీ

స:

| గీత సం. | పుట సంఖ్య | | |
|---|---|---|---|
| 16 | 35 | రాముఁవినా నెవడునిల్చు రాజ్యపదవిని<br>కరమున ఖడ్గమునుబూని కాంతును నేను. | (లక్ష్మణుడు) |
| 17 | 37 | నాతో చెప్పగనేలా నాథా !<br>ఎచ్చట రాముడో అచ్చట సీతా ! | (సీత) |
| 18 | 40 | రాముడు నడచునదే సత్పథము<br>ఆపు సుమంతా ఆపుము రథము. | (అయోధ్యాపురుషులు—స్త్రీలు) |

## అరణ్యకాండ

| | | | |
|---|---|---|---|
| 19 | 42 | పొంగుమగని వెనుదిరుగకు నౌకా<br>గంగా నీవుప్పొంగకుమా<br>శ్రీరాముని నామము పాడుచు<br>శ్రీరాముని దాటించు సుమా<br>జయగంగే జయ భాగీరథీ<br>జయ జయ రామా దాశరథీ ! | (గుహుడు) |
| 20 | 45 | లక్ష్మణ రమ్మిట నిల్పు కుటి<br>ఈ మందాకిని నికట తటి. | (రాముడు) |
| 21 | 47 | చివరకు చేసితి నమఃప్రణామము<br>పలికె రాముడీ వాక్యస్తోమము. | (సుమంతుడు) |
| 22 | 50 | క్రమ్ముకొనె దశదిశల నంధకారము<br>క్షీణదేహ మిడజాలకుండె నా<br>ప్రాణములకు నాధారము. | (దశరథుడు) |

| గీత సం. | పుట సంఖ్య | | |
|---|---|---|---|
| 23 | 52 | మాతవేకావు వైరిణీ ! కావు అశ్వపతి కన్యవు నీవు కనినను జననివి కావిక నీవు. | (భరతుడు) |
| 24 | 54 | ఆత్మరక్షణకయి గుహకు నమపవయ్య జానకిన్ చాప బాణ పాణివగుచు జాగ్రతమను రాఘవా ! | (లక్ష్మణుడు) |
| 25 | 56 | దుఃఖమిచ్చు దైవమె భరతా ! దోషమెవరిదిందు ? ధరణిలోన మానవమాత్రుడు పరాధీనుడెందు. | (రాముడు) |
| 26 | 59 | అరిగె పితయు మాతయు నిపుడీ భరతుడగతికుండు నా ప్రార్థన మొక టే రామా ! మీ పాదుకలిందు. | (భరతుడు) |
| 27 | 61 | ఎచటివాడ వెవడవు రాజకుమారా ! దేహము నర్పించితి శ్యామాకారా ! నన్నిదె స్వీకరింపవేరా ! | (శూర్పణఖ) |
| 28 | 64 | విరూపయయ్యెను శూర్పణఖయె రఘు వీరుని యా దుష్కృతి కసిదీర్చుకొనుము లంకాపతీ ! | (శూర్పణఖ) |
| 29 | 67 | నే పూలుగోయుతరి నిటువో జూచితి గాదా ! కొనియిమ్ము నాకు నాహరిణ మయోధ్యానాథా ! | (సీత) |
| 30 | 69 | యాచకా ! నిలువకు ద్వారమువాని ఘననీలిమ రూపొందిన మెరపున కాల్చుకొనకు నీపాణి. | (సీత) |

## కిష్కింధ కాండ



## సుందర కాండ

## యుద్ధకాండ

## ఉత్తరకాండ

# అంకితము



రామా ! ఈ కృతి సీతా
రామామణి సన్మనోభిరాముఁడవగునీ
శ్యామల కోమల సత్పద
శ్రీ మహితాబ్జముల భక్తిచేనర్పింతుఁ ॥

రచయిత : వానమామలై.



గ్రంథ అనువాద కర్త
వానమామలై వరదాచార్యులు.



గ్రంథ ముద్రణ కర్త
మాన్యశ్రీ నరాల వెంకయ్య శ్రేష్ఠి గారు.
మారుతీ బీడీకంపెనీ ప్రొప్రైటర్, దూద్‌గాంవ్, నిర్మల్.

# ముందుమాట

మహారాష్ట్ర భాషలో మహాకవి శ్రీ గ. ది. మాడ్గుళ్కర్ మహాశయుడు వ్రాసిన గీతరామాయణమునకు బహుళప్రచారము కలిగి ప్రజాదరణ లభించినది. ఒక భాషలోని సరసమైన వాఙ్మయము ఒక భాషనుండి మరొక భాషలోనికి పరివర్తన మొనర్పబడుట పరస్పర సమన్వయసామరస్యమునకు తోడ్పడును. అట్లే మన యాంధ్ర భాషలో రామాయణ భారత భాగవతాది మహా పురాణములను నన్నయాదికవులు అనువదించుట జరిగినది. ఇది ఆంధ్రజాతికి క్రొత్తమార్గము కాదు.

శ్రీ గీతరామాయణము సరసమై సరళమై పండిత పామర రంజకమై యుండుటగాంచి నాకీ కృతి తెలుగులో అనువాదము చేసిన బాగుండునని భావము బలపడినది. కాని నాకు ఆంధ్రభాషలో దానికి తగినంత పాండిత్య బలము సమగ్రముగా లేనందున ఉపేక్షించవలసి వచ్చెను.

శ్రీ ఆచార్యులవారు నాకు చిరపరిచితు లగుటవారు ఆంధ్ర భాషలో మహా కావ్యకర్తలగుట భావించి వీరిచే ఈ అనువాదము జరిపించుటకు తలపోసితిని. ఇంతలో శ్రీ ఆచార్యులవారును నేనును తడపాకలో పూజ్య శ్రీ నారాయణ మహారాజుగారి పుణ్యతిథి అవసరమున జరుగు మహోత్సవమునకు పోవలసి వచ్చినది. అచ్చట మా భాగ్య పరిపాక వశమున కుష్ఠాపుర నివాసులగు బ్రహ్మశ్రీ ధోండూశాస్త్రి గవయ్యాగారు కనబడుటయు, వారి గాన కార్యక్రమము మేము వినుటయు తటస్థించినది. అపుడు శ్రీ శాస్త్రిగారు గీతరామాయణములోని కొన్ని పాటలను సుమధురముగా శ్రుతి రంజకముగా పాడి మా హృదయములనాకర్షించిరి. వారును ఈ గీతరామాయణమును ఆంధ్రభాషలో ననువదించుటకు నావలెనే ఆచార్యులవారితో మనవి నొనర్చిరి. మరియు "మహారాష్ట్ర గీతరామాయణమునకు సుధీర ఫడ్కే

సంగీతము బాణీ రచించి సుమధురముగా పాడి దానిని దేశపరివ్యాప్తమొనర్చి నట్లు గీతరామాయణమున కనువాదములైన మీ తెలుగు పాటలకు స్వర సంగీతముల నిర్మించి వ్యాప్తిచేయగలను" అని అచార్యులవారిని నిర్భంధించుట జరిగినది. దానితో నా ఆశయము కార్యరూపము తాల్చి ఈ కృతి ఆకృతిని దాల్చినది. దీనికి బ్రహ్మశ్రీ ధోండుశాస్త్రిగారు సంగీత పద్ధతులను నిర్మించు టయు జరిగినది. ఈ అనువాదములో మహారాష్ట్రములో ఆచార్యుల వారికి పూర్ణ పరిచయము లేకుండుటచే నేను వారికి అండదండలుగా నుండి సహాయ పడు సేవకు నోచుకుంటిని. శ్రీ ఆచార్యులవారు వీలైనంతవరకు మూలమునకే మాత్రము వ్యతిరేకము కాకుండా మూలములోని ఛందస్సును అంత్యప్రాసాది నియమములను మరియు తెలుగులోని యతిప్రాస నియమములను జతపరచి ప్రయాసపడి సరళ సుందరముగా రచించినారు. ఈ కృతిని సరసులు సహృదయులు పరామర్శించి ప్రోత్సహించగలరని విశ్వసించుచున్నాను.

ఇట్లు

**M. DUTTATREYA RAO.**

M.A., B.Ed.

# గీతరామాయణము

## బాలకాండ

## 1

శ్రీరాముని యశ్వమేధయజ్ఞము కొఱకు అయోధ్యలో మనుష్యుల మహాసాగరము నిండుకొని యుండెను. తాపసవేషధారులు వటువులిద్దరు యజ్ఞమండపము లోనకు వచ్చిరి. మేము వాల్మీకి మహర్షి శిష్యులమని పలికిరి. కవీంద్రుడైన వాల్మీకిచే విరచితమగు రామచరిత్రమును గానము చేయుదుమనిరి.

నామందు నా చరిత్ర గానముచేయు నీవటువులు నా పుత్రులేయని శ్రీరామచంద్రునకు తెలియదు.

### నివేదకుడు

పల్లవి : అవనీపతి రామప్రభు స్వయముగ నాలకించుచున్నాడు
కుశలవుల్ పాడిరి రామాయణము.

కుమారులిద్దరు సమవయస్కులు
జానకినాథుని సజీవప్రతిమలు
తనయులుపాడిరి జనకుని చరితలు
జ్యోతితోనిచ్చిరి నీరాజనము ॥కుశ॥ 1.

మూర్తిత రాజస మునివేషమ్ముల
వారలు తాపసవనిగంధర్వులె
మునివాల్మీకి మనోభావముల
మానవాకృతినిచ్చిరి యాక్షణము ॥కుశ॥ 2.

ఆ ప్రతీహారూపామ్ర వనమ్ముల
వసంతవిభవము పాడుచు కోకిల
కిలకిల గూయుచు కలరవమ్ముల
నింపెను ఋతురాజము గాయనము. ॥కుశ॥ 3

మృదుపుష్పమువలె పెదవులుకదల
స్వరసుగంధమూపగనా జనుల
కదలియాడు వరకర్ణభూషల
సంగతిన్ వీణాఝుంకారము. ॥కుశ॥ 4

సప్తస్వర సుస్వర్గమునుండి
నవరసములు స్వర్ణదులై నిండి
సవనవేదిదిగి స్రవించుచుండె
శ్రోతలొనరింత్రు సంగమజ్జనము. ॥కుశ॥ 5.

స్వపురుషార్థముల చౌకటునుంచి
తనజీవనపటమును దిలకించె
ప్రత్యక్షమ్మును ప్రతిమేమించె
ప్రభుకనుల చెమ్మగిలెన్నీరము. ॥కుశ॥ 6.

సామగానమును సల్పిరిబాలురు
సర్గవెంటజనె సర్గప్రతతులు
శిరములనూపగ శ్రీమునిసచివులు
చెక్కులందూకె నస్రుపూరము. ॥కుశ॥ 7.

కనకపీఠిదిగి కదలె రాఘవుడు
తనకై శవమునె దరిగొనెనపుడు
పుత్రాలింగన పూర్ణోత్సవములె
ఐనాడుభయుల కజ్ఞాతము. ॥కుశ॥ 8.

# 2

శ్రీరామచంద్ర సార్వభౌముని యజ్ఞమండపములో శ్రోతలందరును చెవులలో ప్రాణములన్ని పెట్టుకొని విని యానందించుచున్నారు. శ్రీరాముడు స్వర్ణ సింహాసనాసీనుడై వినుచుండెను. తాపసవేషధారులైన రాజపుత్రులు కుశలవులు శ్రీరామచరిత్రమును గానమొనర్చుచున్నారు.

కుశ — లవులు

పల్లవి : అది సరయూతీరము అయోధ్యా
మనునిర్మితనగరము ॥అయోధ్యా॥

సువిశాలంబగు సుందరనగరు
సొంపగుమేడలు శోభలనలరు
మధ్యసమాంతర మార్గములమరు
రథగజాశ్వములు పథికులుచనెదరు
ముస్తాబై నిరతము ॥అయో॥ 1.

ప్రతిభవనముపై రత్నతోరణలు
ముందువెనుకల సుందరవనములు
ఆ వనముల నృత్యాలు గానములు
సదానందించే మృదంగవీణలు
అలకాపురిప్రతిమము ॥అయో॥ 2.

మొద

స్త్రీలు సతులు ధార్మికులు పూరుషులు
కుమారులో నిజకుల దీపకులు
లేరు నృశంసులు లేరు నాస్తికులు
తెలియవట నపంత్య స్థిరేఖలు
నగరినింట సహితము ॥అయో॥ 3.

ఐక్ష్వాకాన్వయ యశో భూషణుడు
ధర్మపరాయణ దశరథనృపుడు
ఆ నగరమునకు ఆత్మ రక్షకుడు
స్వగృహచంద్రుడు నగరినింద్రుడు,
సంగర రవిబింబము ॥అయో॥ 4.

తరుణులుముగ్గురు దశరథుభార్యలు
సువంశజాతలు సుందరచర్యలు
సిద్ధహస్త పతిసేవాకార్యలు
బహుశ్రుతలు రూపవతులు ఆర్యలు
అతులప్రభాసుందరము ॥అయో॥ 5.

ముగ్గురుభార్యల మోదసంగమున
ముల్లోకపు సుఖముల విహరించిన
గాని ఒకటి యే కరువు గృహమ్మున
ప్రేమాంబరమున ప్రియసుతోదయము
నేటివరకు గానము ॥అయో॥ 6.

హృదయశల్యమొకటే కౌసల్యకు
ఉదాసీనముఖమొప్పు సుమిత్రకు

శ్రీ

స

కై కచేసె సుతుకై కలవ్రతముల
వ్యధయొక్కటె దశరథనృపునకునిక
కెలుకునభ్యంతరము ॥అయో॥ 7.

రాజసౌఖ్యమే ప్రజాసౌఖ్యము
సకలమనమ్ములనొకే విచారము
ఈ సుఖధనముల నేమిలాభము
కల్పతరువునకు గల్గదె ప్రసవము
వసంతావాసరము ॥అయో॥ 8.

# 3

"కల్పతరువునకు గల్గదు ప్రసవము వసంతానంతరము"

ప్రజానీకమును సుఖమందాకినీ తరంగములలో స్నానమాడించు దశరథుని ప్రాసాదములో ఊయెల ఊగకుండుట ఎంతటి దుర్విధి యన వలెను. అయోధ్య యందలి విజ్ఞుడైన ప్రతిపౌరుని మానసమందీ ప్రశ్న వేధించుచునేయుండెను.

వీరికే ఇట్లుండగా దశరథుని రాణుల హృదయాంతర్గతమగు విచారావస్థనే మనవలెను? కౌసల్య చూచుటకు గ్రీష్మకాలమునందలి నదివలె సన్నగిలినను శాంతముగా నగపడుచుండెను. ఆ పరిస్థితిలో ఆమె మనస్సులో ఏమనుకొను చుండవచ్చును?

## కౌ స ల్య

పగులు నెద నిష్కారణమిదియేల?
తీవపైఁ గన్గొన, విరిసిన పూల

మొ॥

ఎపుడు తెలియదిటు, లెదలో మలినత
సదాశోకదే, సవతి మత్సరత
వే(చునీలతా విభవమిపుడేల ॥తీ॥

ఇంతటి యసూయయేల హృదయమా ?
హరిణ శాబకములన ననిష్టమా
బాష్పముల రెప్పలు తడిగానేల ॥తీ॥

గోవత్సమ్ముల భావముగాంచు
హేస్పర్థా ! నీ కేమనిపించు
శాంత హృది చిడిముడి పడునేల ॥తీ॥

పులుగు ఒకటి పిల్లలకు మేతనిడ
ఆ దృశ్యము నీవరసి మథనపడ
ఏమిటుల్ విపరీతంబీ వేళ ? ॥తీ॥

నా దాపరికము నాతోనేనా ?
వత్సలత వినా వనిత యపూర్ణా
జన్మ సార్ధకత దెలిసె నీలీల ॥తీ॥

పొందును శిలనుండి మూర్తి జననము
కౌసల్య యొ శిల కంటెను నధమము
విచారము, తల వ్యాపించెను చాల ॥తీ॥

నా కంటెను గగనము వృద్ధగదా
ఎన్నొ తారలుదయించునట సదా
జీవనమె, వృధ యనిపించీ లీల ॥తీ॥

# 4

"పగుల్చునకారణముగ మదియేల ? తీవపై గొన్గన విరిసినపూల"

మహారాణి కౌసల్య ఇట్టి చమత్కారమగు విచారస్థితిలో నుండగా దశరధుడు తా నంతఃపురములోనకు వచ్చెను. తన ప్రియమైన రాణులతో నిట్లు భాషింపదొడగెను.

దశరథుడు

ఉదాసీనవగుటేల ? కంటనీరుంచకు పూబోణీ
ప్రేయసీ కౌసల్యారాణీ !

వచ్చెవసంతుడు, వనతరువరముల, విచ్చెపల్లవములు
నామదిలోనుప్పొంగుచువచ్చెడి నవవాంఛితమటులు,
నా కర్ణములన్ ధ్వనించియిటు విననయ్యె సహజవాణి ॥ప్రే॥ 1.

ఆవాణియొ నీవొనరుచు దశరథ అశ్వమేధ మఖమనెను
నాల్గువేదములు శిశువులుగా భవనమున పారాడుననెను
ఈనాకాంక్షయె జాగృతినిడి నాయెద నిండెను మృదుపాణి ॥ప్రే॥ 2.

నిమంత్రించి నే సుమంతమంత్రికి నిజాజ్ఞనిటు లొనరించితి
వసిష్ఠ కాశ్యప జాబాలురనివ్వ సతిదెమ్మని వంచించితి
వారి యిష్టమేమొ తెల్పెదరు గురువరులంటిని దొరసానీ ! ॥ప్రే॥ 3.

వచ్చిరి గురువులు నామది కోర్కెలు వారికి నేజెప్పితిని
వారిసాక్షిగా నేను నామనస్సారము మథియించితిని
స్నిగ్ధ సుధామధురోక్తుల వారిటు చెప్పిరపుడు దయాబూని ॥ప్రే॥ 4.

"మనోదేవతలు చెప్పిరిటులు 'నీమనోరథముపూర్ణమగున్'
'ఈ ముహూర్తమున విడువుమశ్వమది యేగనిమ్మికడుత్వరగన్"
అని మునులన 'గుర్వాజ్ఞమాన్యమిది' యంటి మ్రొక్కి యలివేణి 5.

అంగదేశ ఋష్యశృంగమునినేనై యిచటికి గొనివత్తున్
ఈ నాయిష్టిని నతనిచేత చేయించిదాని సరిపుత్తున్
మంత్రయుక్త ధూమావృతమై సమ్మాన్యమగు రాజధానీ ॥ప్రే॥ 6.

సరయూతటి యజ్ఞముచేసి ముక్తకర దానముచేయుదము
కడప్రయత్న మొనరించి యంత్యమున గావించెదమవబృథము
అగ్నియొసగు నీయిష్టములనంత హస్తమ్ముల పూబోణీ! ॥ప్రే॥ 7.

# 5

"అగ్నియొసగునీ యిష్టములనంత హస్తమ్ముల భూజానీ॥

ఈ యిష్టముతో దశరథుడు యజ్ఞాశ్వమును విడిచెను. తిరిగి ఒక సంవత్సరాంతము ఆ యజ్ఞాశ్వము ఇంటికి వచ్చెను. రాజగు దశరథుని యాజ్ఞానుసారము ఋష్యశృంగుడా యజ్ఞము పూర్తియొనర్చెను. ఒక శుభ వేళ యజ్ఞాగ్నిజ్వాలలనుండి రక్తవర్ణముతో నొప్పు మహాపురుషుడు ప్రకట పడెను. మరియు దుందుభివంటి మధుర గంభీర స్వరముతో రాజగు దశరథుని గాంచి యిట్లనెను.

## యజ్ఞపురుషుడు

దశరథా! పాయస దానము గొమ్ము!
ఈ యజ్ఞములో ప్రకటమైతినేనిది నాసన్మానమ్ము.

సాంగమయ్యె నీజన్నంబదియును
తృప్తులైరి దివి దేవత లెల్లను

రాజా ! నీపై ప్రసన్నమయ్యేను
శ్రీ విష్ణువు హృదయమ్ము ॥దశ॥ 1.

ఆ శ్రీవిష్ణువు ఆజ్ఞయయ్యేనని
కూర్మి ప్రసాదము కొని వచ్చితివి
ఈ దానమున కిదేసాటి ధరణి
మరిలేదు సమానమ్ము ॥దశ॥ 2.

స్వహస్తముల గొను స్వర్ణపాత్రమును
ఇమ్మురాణులకు నీపాయసమును
కామధేను దుగ్ధమ్ముల కంటెను
బలకరమోజ స్వంతమ్ము ॥దశ॥ 3.

భార్యలు నేతురు పాయస భక్షణ
వరలునుదరమున వంశారోపణ
ఆగర్భములందగును నవతరణ
యోద్ధాచతుష్టయమ్ము. ॥దశ॥ 4.

భార్యలు ముగ్గురు ప్రసూత లగుదురు
మూర హర్యంశల నరులను గాంతురు
ధన్యశరథా ! ధరనీకొాదవును
దేవజనక భాగ్యమ్ము. ॥దశ॥ 5.

అగపడు కనులు కృతార్థుడవీవన
నేను కృతార్థుడ నీ దర్శనమున
ఆజ్ఞనిమ్ము నృపయజ్ఞములోనే
నగు దంతర్ధానమ్ము. ॥దశ॥ 6.

# 6

"ఆ గర్భమునం దగును అవతరణ యోద్ధా చతుష్టయమ్ము"

ఇట్లేయజ్ఞపురుషుని వచనములు సత్యములయ్యేను. ఆ పాయస సేవనమువలన దశరథుని ముగ్గురు రాణులు గర్భవతులైరి. కౌసల్యకు శ్రీరాముడు, సుమిత్రకు లక్ష్మణుడు శత్రుఘ్నుడు, అట్లే కైకకు భరతుడు అనబడు నలువురు పుత్రులు జననమొందిరి. రాజుగారి యభీష్టము పూర్ణ మయ్యేను. రాజప్రాసాదములో మేర మీరిన సంతోష సముద్రము తాండ వించుచుండెను.

నగర జనుల యానందము నిలువెల్ల నిండి తొణికిసలాడెను. శ్రీరామాది సోదరులు ప్రాంగణమంటి నల్దిసలు పారాడ దొడగిరి. అయినప్పటి కిని అయోధ్యా వాసినులగు స్త్రీలు పదేపదిగ శ్రీరామ జననమునే పాడుకొన సాగిరి.

### అయోధ్యా స్త్రీలు

జన్మమయ్యె సఖియ ! రామ జన్మమయ్యేను.
శుభతిథియగు చైత్రమాస శుద్ధనవమిని

గంధయుక్తమయ్యు వేడిగాలివీచును.
ఇనుడు తలనె నిల్చిపోయె నేలా ? మధ్యాహ్న వేళ
జన్మమయ్యె సఖియ ! రామ జన్మమాయెను. 1.

కౌసల్యారాణి యల్ల కనులు విప్పెను
తల్లికనులు మెరసె పుత్ర దర్శనమునను
గళము దట్టి పట్టి యశ్రు జలము పొరలెను. ॥జన్మ॥ 2.

నవ్య సౌఖ్య పర్వము భూనాథునింట వెలసె
పాలుచేపి ధేనువులంభాయని బిట్టరచె
దుందుభినాదములు నగర మందు నిండెను. ॥జన్మ॥ 3.

విరిసిన మొగ్గలును నెండ వేడి సోలెను.
"ఏమిదేమి" యనగ బేల మోము విప్పెను
గాలి బిగ్గనవ్వి వాని గాంచి చెప్పెను. ॥జన్మ॥ 4.

పల్లెకి శుభవార్త చెవిన బడినయంతను
ఇంటినుండి రాజమార్గమంటి యురికెను.
యువతి సంఘమొకటి పాడుచేగు చుండెను. ॥జన్మ॥ 5.

పుష్పాంజలి గుప్పిరొకరు భూషలొక్కెడ
హాసోద్ధతి వినబడ, వే భాషలక్కడ
తాళ వాద్య గతి మాత్రము త్వరితమాయెను. ॥జన్మ॥ 6.

నూపుర రుతి వీణాధ్వని లోపమందెను
రవళుల రొద చెవిగూబలు తపన పడియెను
ముగ్ధత కోకిల మావుల మూగవోయెను ॥జన్మ॥ 7.

చిరుకదలిక దిగ్గజములు చిత్రము జూచెన్
రమ్యాభ్రము నేడు క్రొత్తరంగుల పూచెన్
నింగిని మౌక్తిక చూర్ణము నిండి వెల్గెను ॥జన్మ॥ 8.

జనపద మాటల పాటల మునిగితేలెను
మధురస్వర రంగతాళ మగ్నమేదినీ
ఉర్విగూడి శేషుడు తానూగె డోలను. ॥జన్మ॥ 9.

# 7

"జన్మమయ్మె సఖియ రామ జన్మమాయెను"

ఈ యానంద గానములో నయోధ్య మగ్నమైయుండెను. రాజ రాజు ప్రాసాదములో శ్రీరామచంద్రుడు దినదినాభివృద్ధి నొందుచుండెను. అతడు తప్పటడుగులు వేయసాగెను. వచ్చిరాని వాక్కులనాడ దొడగెను. మహారాణియగు కౌసల్య చెల్లెండ్రగు సవతులతో తనయానందమును కుతూహలముతో నిట్లు చెప్పుచుండెను.

కౌసల్య

శ్యాముడైనరాముడు సఖి జలకమాడు నాదగుతొడపైనను
అష్టగంధపరిమళములు నాసీలాంబుజమున విడివడియెను. 1.

శ్యాముడైనరాముడు సఖి మామకహస్తమున భోజనముగొను
రామభుక్తశేషమునకు రామచిలుకలెదిరిచూచుచుండును. 2.

మంజుశ్యాముడు రాముడు మణిమంచముపైన నిదురగూడును
జలజాక్షుని రామునిగని చంద్రుడు మేఘములనాన దాగును 3.

శ్యాముడైనరాముడు ననుజన్ములతోగూడి యాడుచుండెను
హీరమ్ములలో చారుమసారమువలె మెరసి యాడుచుండెను. 4.

శ్యాముడైనరాముడు సఖిసహోదరుల ననురాగమ్మునగను
కన నాపసిపాపలవర్తనముల పెద్దలును నేర్వదగిమను. 5.

శ్యాముడైనరాముడు సఖి రామానుజులైన మువ్వురితోడను
నా భాగ్యశ్లోకమునకు నాల్గుఖండచరణమ్ములనంజను, 6.

బాలుడు శ్రీరాముడిపుడు వచ్చిరాని ముద్దుమాటలాడును
అతనితోడబల్కెడి మనయందరినుడి యదేవిధముమారును 7.

శ్యాముడైనరామునితో సదనమె యస్పష్టవాక్యమయమగు
వచ్చిరాని మాటలాడువారగుదురు వేదవిదులు ద్విజులును 8.

శ్యాముడైనరాముడు సఖి చదలంగల శశినిమ్మనియడుగును
ఆనిశి నాబాలునితో నాలయమే జాగరణము చేయును. 9.

శ్యాముడు రాముడు రేపాక చక్కనైనవయసు కోడెయయ్యెనా
వరుణుడగుచు పూర్ణకృపావర్షమ్మును జనములపై గురియును. 10.

# 8

"శ్యాముడైన రాముడు సఖి"

మహారాజ్ఞియైన కౌసల్య యొక్క శ్యాముడైన రామచంద్రుడు దినములరుగ మాసములేగుచుండ వృద్ధిగాంచెను. బాల్యములోనే విలువిద్య నంత కైవస మొనర్చుకొనెను. ధర్మగ్రంథముల నభ్యసించెను. ఇప్పుడిప్పుడే రాజసభలో కూర్చొనుచుండెను. అతనితో నతని సోదరులును, అన్నివిద్యలలో కౌశలమును సంపాదించిరి.

ఒకసమయములో రాజైన దశరథుడు, తన నలుగురు కుమారులతో గూడి రాజసభ నలంకరించి సింహాసనాసీనుడై యుండగా విశ్వామిత్రుడు తానచటికి వచ్చెను. రాజతనికి స్వాగతమిడి నమ్రీనుడై యానందముతో నిట్లు విన్నవించెను. మునిషర్యా ! ఏ కార్యమొనర్ప నాజ్ఞాపించెదరో తెల్పగలరు. నేను నా సర్వశక్తితో దానిని చివరివరకు నిర్వహించగలను.

రాజుగారి యీ సాదరవచనములకు సంయమీంద్రుడగు కౌశికుడు మిగుల హర్షించి ఇట్లు వచించెను.

విశ్వామిత్రుడు

నీజ్యేష్ఠ కుమారు నాకు నిమ్ము దశరథా
యజ్ఞ రక్షణమున యోగ్యుడతడె సర్వధా

మాయావులు రాత్రిచరులు
మాకిడి రెన్నో బాధలు
ఎన్నిసార్లు మఖమొనర్పనెపుడు పూర్తికాదు గదా! 1.

క్షమిని దీక్షనుంటి నేను
శాప మెట్టు లిడుట లౌను
యజ్ఞ విఘ్న మొదవినంత యా స్థలమునె విడుతుసదా 2.

మరలి యజ్ఞమును మొదలిడ
తిరిగి విఘ్నములు జతపడు
కుండమ్మున జ్వాలరేగ మండపమున నుంద్రు బుధా 3.

విమల వేది రక్తమాంస
వృష్టి నేతు రా నృశంసు
లాపినంత సవన మంత్ర, మసుర స్వైరనాట్యకథా 4.

బాలవీర రామనేత
వారిని శిక్షించుగాత
ఈ కొమరుడు బాలుడయ్యు నెంతొ యోగ్యుడీ వసుధ 5.

మది శంకిల నేల నృపా
మౌని వేడు రాజకృపా
వాగ్దానము పాలింప నృపా తడబడనేల వృథా 6.

అసువు కంటె వాక్కు ప్రీతి
యా రఘువుల దిదేరీతి
చూపించును రాముడె మీ శూరసిద్ధతా 7.

విలపింతువె కౌసల్యా
వీరమాత యెపు డభయ
సుతుడు పోర నుభయ కులాల్ చొక్కధన్యత 8.

ఆ మారీచ సుబాహులు
అసురులు ఆయత బాహులు
బాలు గాంచ నస్త్రములనె నేలవ్రైతు రమిత వ్యధ 9.

ఘనుడవు నీవే రామా
ధనుర్బాణముల గొనుమా
వెను వెంటన్వచ్చిన నీయనుజుడు రానీ సువ్రత. 10.

# 9

"నీ జ్యేష్ఠ కుమారు నాకు నిమ్ము దశరథా"

మహర్షియైన విశ్వామిత్రుని కోరికను దశరథ మహారాజు నిరాకరించలేకపోయెను. చేతిలో విల్లును మూపులనమ్ములపొదిని గైకొని రామలక్ష్మణులు సంసిద్ధులైరి. అన్నతోపాటు, తమ్ముడగు లక్ష్మణుడుకూడ బయలుదేరెను. మాతృశ్రీ కౌసల్య కర్తవ్య నిర్వహణార్థము పుత్ర మమతను కట్టి

పెట్టిన దాయెను. రాజ కుమారు లిరువురికిని "జయీాభవ" యను యాశీర్వాద మొసంగెను, మహారాజగు దశరథుడు పుత్రుల మస్తకము ప్రేమతో నాఘ్రాణ మొనర్చెను. విజ్ఞానియైన విశ్వామిత్ర మహర్షి వంటి నేతతో రామలక్ష్మణులు ప్రథమపరాక్రమమును రుచిచూపించుటకు రాజప్రాసాదమునుండి బయటబడిరి. ప్రయాణమందుగురు దేవుడైన విశ్వామిత్రుడు రాజకుమారులకు అనేక కథలను ప్రబోధించి జ్ఞానోదయము గావించుచుండెను. ఇటులేగుచు వారు మలదకరూశదేశ పరిసరముల చేరిరి. అకస్మాత్తుగా పిడుగులు పడినట్లు భీషణ ధ్వని వినవాయెను. ఒక భయంకర రాక్షసి వారిమార్గమున కడ్డువచ్చెను. సంతప్తుడై విశ్వామిత్ర మహర్షి రాముని కిటు లాజ్ఞాపించెను.

## విశ్వామిత్రుడు

వింట వడి శరము నిడి విడువుమీసాయకము
తాటక వధింపుమీ రామచంద్రా
దుష్టమాయావినీ దుర్యక్షిణీశక్త
వర్తనన్ దర్శనన్ ఇది అభద్రత గూడు
ఆరక్తత ప్త నేత్రాలోకముల( జూడు
కాననము వల్లరులు కాలిపోయెనునేడు
అతుల బలగర్వితాకృతి గొనెను క్రూరత
రోతగా జూచెడిన్ క్రూరముద్ర.........రామభద్ర. 1.

వికటాట్టహాసాల వినుచున్న చుండెనల
దంతములు దౌడలును దానిజూడుము కుటిల
మృత హస్తివదనగుహ ప్రతిదాని వక్త్రిమల
సరిగ మృత్యుచ్ఛాయ కరణివచ్చును వనుల
నారియిటు వచ్చెనిక నారి లాగుము త్వరగ
బాణమేయుమి యణగుదానితంద్ర ॥తాట॥ 2.

ఆగిపోయెద వేల వేగవిడు మస్త్రాలు
ఈమె మృతి పీవనుచు ఎరుగు మాహృదయాలు
జనసౌఖ్య కారికిల వనితా వధము పోలు
క్షితిపు ధర్మమె చెప్పు కీర్తిసాంద్రా ! ॥తాట॥ 3.

ధర మ్రింగ నురుకాడు దైత్య కాంతను నాడు
శుక్రమాతను ద్రుంచె చక్రియగు విలుకాడు
చెండాడగావచ్చు సింగ మాడదియైన
వధ్యయగు శత్రువే వరనరేంద్రా ॥తాట॥ 4.

అతికోపమున నురికి యరుదెంచు మనదెసకు
పర్విడెడి దానినే పంపు నరకమ్మునకు
నీ విక్రమము గాంత్రు దేవ పురుషోత్తమా
సలుపుమిక పూర్ణిమన్ శౌర్య చంద్రా ! ॥తాట॥ 5.

# 10

"తాటక వధింపుమీ రామచంద్రా"

విశ్వామిత్రుని యాజ్ఞానుసారము శ్రీరామచంద్రుడు తాటక వధ మొనర్చునపుడు ఆకసమునుండి దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. శ్రీరాముడు లక్ష్మణునితో గూడి విశ్వామిత్రుని సిద్ధాశ్రమమునకు వచ్చెను. యజ్ఞమునకు విఘ్నమొనర్చునట్టి మారీచుని మానవాస్త్ర ప్రయోగమున సముద్రమున ముంచివైచెను. ఆగ్నేయాస్త్రమున సుబాహు వధమొనర్చెను. విశ్వామిత్రుని యజ్ఞము సాంగోపాంగముగా పూర్తియయ్యెను.

దేశ దేశ భూమీశులు వచ్చిరి
ఆ ధనువునుగని యచ్చెరువొందిరి
ధనువుగాంచగనె దానినెత్తుటకు
నృపలోకము ముచ్చట పడుచుండును. ॥పద॥ 4.

సురలు నరులు కిన్నరులు దైత్యులును
అణుమాత్రమెత్తరైరా ధనువును
వంగియున్న చాపము నిసుమంతయు
చక్కజేయగా జాలరేమనను. ॥పద॥ 5.

నారిని ధనువున గూరుచువాడును
వంచినారి మ్రోగించెడి వాడును
వింటశరమ్మిడి విడిచెడి వాడును
అవతరించలేదవని నెవ్వడును. ॥పద॥ 6.

సహజయోధులు లసద్ధనుర్ధరులు
ధనువును మీ నేత్రములగన్గొనుడు
చూడుమి రాఘవ సుమిత్రాత్మజుడు
ఉత్సుకతను నెంతో జూపించును. ॥పద॥ 7.

కడు కౌతుకమున వెడలిరి మునులు
వెడలుడివుడు మావెంట నుభయులు
సహప్రవాసులై సాగుడి మీరలు
భాగ్యతరువు ప్రసవించి ఫలించును. ॥పద॥ 8.

# 11

"పదపద శ్రీరాఘవా, పరికించపలెను మిథిలను."

ఈ మునిజనులు తనను మిథిలకురమ్మని బలవంతపరచుట రాముడు తానేమాత్రము నిరాకరించలేక పోయెను. అనుజన్ముడగు లక్ష్మణునిగూడి మునిజనులతో పాటు మిథిలకు పోవుచుండెను. మార్గమధ్యమున విశ్వామిత్రుడు వారికి మనోజ్ఞములగుననేక కథలను వినిపించుచుండెను. దారిలోనియొక పాడుబడియున్న ఋష్యాశ్రమమునకు వారరుదెంచిరి.

"ఈ యాశ్రమమేల శోభావిహీనమై యున్నద"ని రాఘవుడడుగగా విశ్వామిత్రు డతనికి పాపాచరణము వలన శిలయై పడియున్న అహల్యా వృత్తాంతమునంతయు తెలియజెప్పెను. చరణరజస్పర్శచే నామెనుద్ధరింపగా రామున కాజ్ఞయొసంగెను.

శ్రీరాముని చరణస్పర్శము వలన శిలాకారముతోనున్న యహల్యా కళేబరములో ప్రాకాళ ముదయించెను. ఆమె రామునిగని కోమలస్వర మొప్పగా నిటుల పల్కెను.

అహల్య

స్వామి రామ నీచరణము సోకెను
ముదమున శాపవిముక్తనైతిని.

శ్రీ రామకృపా శిల్ప సత్కృతిని
తిరిగినేడు దాల్చితి నరాకృతిని
శ్వాసము విడిబడె స్వామి భవత్పద
పావన రాజీవము ముద్దిడితిని. ॥స్వామి॥ 1.

కనుల పూర్వమటు కలిగెను దృష్టియు
నే జూచితి నిను నీలో సృష్టియు
ఆగియాగి కోష్ణాశ్రుతోయములు
కాల్వగట్టెనా కపోలయుగళిని ॥స్వామి॥ 2.

చెవులకు మరల నొదవె వినుశక్తి
ఆత్మనుఖ్యాంగె నమూల్య సూక్తి
అహల్యా లే లెమ్మనుచు నెవరాయన
కరుణపూర్ణ వాక్యముల వింటిని. ॥స్వామి॥ 3.

తనువది పులకలుగొనుచు వంగినది
ప్రభుపాద స్పర్శము నెరింగినది
చరణధూళియను వరకుంకుమ నా
ఫాలతలమ్మున బరగె భూజాని ॥స్వామి॥ 4.

మౌనవదనమున మాటస్ఫురించెను
భక్తవత్సలుని ప్రభుని నుతించెను
పతితపావనా ! ప్రభు నీదయతో
హాలాహలమగు నమృత తరంగిణి ॥స్వామి॥ 5.

పతితపావనా ప్రభు రఘుకులజా
ఏతీరున నేజేతును పూజ
పునర్జన్మ బొందిన జీవనమును
అభిషేకించితి నంఘ్రియుగళిని. ॥స్వామి॥ 6.

# 12

"ముదమున శాపవిముక్తనైతిని"

అహల్యాసతి రామచంద్రుడు తన యాత్మోద్ధరణమొనర్చి యపార కృపాదృష్టి ప్రదర్శించినందులకై తన యనంత కృతజ్ఞతల బ్రకటించుటయు నామె యభీష్టానుసారము విశ్వామిత్రుడా గౌతమాశ్రమములో కించిత్కాలము విశ్రమించెను. తదుపరి, తక్కిన మునిజనములు వెంబడింప పథమంటి యేగుచు మిథిలానగరమునకు జనెను. చనినంత జనకచక్రవర్తి మునిసార్వ భౌమునిగాంచి సంతోషసముద్రమున దేలియాడి సాదరగతి స్వాగతమొసం గెను. మునిజనుల వెంట వచ్చిన యిద్దరు రాజకుమారులు అయోధ్యాధీశుడగు దశరథుని ముద్దుకుమారులని తెలిసిన జనకుని యానందార్ణవము వేలాతి క్రమణమొనర్చిన దయ్యెను. అశేష పరాక్రమసమన్వితులగు నీ దశరథావ నీశుని వీరకుమారులు నీవద్దనున్న ఘనమగు శివధనుస్సు చూచుటకై యరుదెంచినారని విశ్వామిత్రుడు జనకునితో వచించెను.

అపుడా ధరాధిపతి అనేక వేలరాజులు ప్రత్యక్షముగా దర్శించు చుండ మల్లులతో నాధనుస్సును రాజసభాభవనమునకు తెప్పించెను. రామ లక్ష్మణులా ధనుస్సునకు ప్రేమాదరములొప్ప వినమ్రులై ప్రణామము లర్పిం చిరి. రాఘవుడా ధనుస్సు నెత్తుటకుగాననుజ్ఞవేడెను. జనకుడవశ్యముగా నెత్తదగుననెను. శ్రీరాముడా ధనుస్సునవలీలగా లేవనెత్తి నారినిగూర్చుటకు దాని కొనను వంచుటలో పిడుగు పడినట్లుగా ప్రచండనాద మయ్యెను. ఆ ధనుస్సు నడిమికి ముక్కలయ్యెను. ఆలోకవిలక్షణ దృశ్యమును తిలకించి పులకించి జనకుడానంద పరవశుడాయెను. తన పెంపుడు పుత్రికయగు వీర్య శుల్కను సీతను ఆ మహావీరునకిచ్చి పెండ్లి చేయుటకు తన నిశ్చయమును ప్రకటించెను. విశ్వామిత్రుడు దాని కంగీకరించెను.

సుముహూర్తకాలములో భూజాతయైన సీతతో రామునికి వివాహ మయ్యెను. తనతమ్ముని బిడ్డలగు ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తియను

వారిని జనకుడు లక్ష్మణ భరత శత్రుఘ్నులకు వరుసగానిచ్చి పెండ్లొనర్చెను. వర్ణింపనలవికాని మహోత్సవము జరిగెను. ప్రథమ పరాక్రమమును ప్రకటించుటకు ప్రాసాదమునుండి బయటబడిన రామలక్ష్మణులు తమతమభార్యలతో గూడుకొని అయోధ్య కరుదెంచిరి. వారు అయోధ్యచేరి అనేక మాసములు గడిచినను వందిమాగధులు సీతాకల్యాణము నిత్యనూతనముగా పఠించుచునే యుండిరి.

## భా ట చా ర ణ

అకాశముతో నందెను వియ్యము
అవనీమాత అపూర్వపు నెయ్యము
స్వయంవరమాయెను జానకీ స్వయంవరమాయెను. ॥జానకీ॥

చని రాముడు సహజముగ నెత్తెనాశంకరకార్ముకము
రారాజగు జనకుడు పూర్ణమనోరథుడై కొనెసుఖము
రామశ్యామల భాగ్యము సీతాభామయెదుట నిలచె. ॥జానకీ॥ 1.

ముగ్ధజానకీ రామధనుర్ధరు ముఖము దవ్వునుండి
ఆత్మశక్తినేకమ్మొనరిచి ప్రియమంది కాంచుచుండె
కపోలసీమల లజ్జాసుమములు క్రమముగ వికసించె. ॥జానకీ॥ 2.

అల్లన రెప్పల విప్పి సీత తానతని గాంచుచుండె
తాడిత ఘాత నినాదమువలె పెనుధ్వనులు మిన్నునిండె
ఇరుఖండములుగ శ్రీరాముడు తాహరధనువును విరిచె.
॥జానకీ॥ 3.

కనులకు చీకటిగ్రమ్మి నృపులు తక్షణము బెదరుగొనరె
మనసులోన లజ్జించుచు సీతావనిత నగుచుదనరె
జనకుని చింతామయదృష్టులు తక్షణము తృప్తిగాంచె.
॥జానకీ॥ 4

కరములుమోడిచి జనకనృపాలుడు కౌశికుతోననియె
దశరథసుతునకు నేడుసీత నర్పణము నేతువినవె
ఆనందముతో సీత కన్నుగవ అరమోడ్పులగాంచె. ॥జానకీ॥ 5.

తండ్రియాజ్ఞచే మంత్రిముగ్ధయై తానునిలిచెబాల
తడబడె నడకలు అంతకంపెను తడబడె పూమాల
సౌఖ్యభవనమున స్వర్ణవర్ణ సచ్చరణములరుదెంచె. ॥జానకీ॥ 6.

వ్యోమనీలిమల నెట్లునిండునో ఉషః ప్రభాకృతులు
రామదేహమందటులు నిండె నారామ కరద్యుతులు
మాయాబ్రహ్మల సంగమై సభామంటపమగుపించె. ॥జానకీ॥ 7.

వంచెతలను శ్రీరాముడు జానకి వైచెను సుమమాల
దివి కరతాళధ్వనులొనర్పగా దేవగణము హేల
అమరగణమ్ముల కర్ణమ్ముల తూర్యధ్వని వినిపించె. ॥జానకీ॥ 8.

అవనిజాత సీతాపతి శ్రీవిష్ణ్వంశ రాఘవుండు
గంధర్వుల సుస్వరములలో జయగానగీతినిండు
ఆకాశమునకు బాంధవ్యములీ యవనితోడగలిసె. ॥జానకీ॥ 9.

# 13

"జానకీ స్వయంవరమాయెను."

తర్వాత కైలాసశిఖరమువలె ఎత్తైన మంచుకొండవలె తెల్లగానున్న తన ప్రాసాదములో శ్రీరాముడు గృహస్థాశ్రమ సౌఖ్యమును అనుభవింప దొడగెను. అత్యంత సుస్వరూపుడును, జ్ఞానవంతుడును, మహా పరాక్రమ శాలియును, సత్యవాక్పరిపాలకుడును అయ్యును పరమ సులభుడగు రాముడు ప్రజలకు ప్రీతిపాత్రుడయ్యెను. శ్రీరాముని సద్వర్తనాది గుణములనుగాంచి దశరథుడు సంతోషముతో నుప్పొంగిపోయెను. ఒకనాడు దశరథుని హృదయ ములో రామునికి రాజ్యభారము నొప్పగించి విశ్రాంతి సౌఖ్యమునొందవలెనని భావము గలిగెను. అంత తన యీవిచారమును గురుజనులకు, బంధువులకు, భార్యలకు, మంత్రులకు, జనకునికిని తెలియపరచెను. ప్రజలు యిదివిని యానందపారవశ్యమున వెఱ్ఱివారైరి. దశరథుడు ఈ వార్తను చాటింపుమని నియమించెను. చైత్రమాస పుష్యనక్షత్రమున శ్రీరాముడు సింహాసనాసీనుడు కానున్నాడని చాటింపుమని నియమించెను.

ఊర్మిళాది సోదరీమణులీవార్తవిని సీతాదేవి మందిరమునకుజని ఆనంద మిశ్రిత వినోదముతో నామెనుగాంచి యిట్లనిరి.

ఊర్మిళా, మాండవీ, శ్రుతకీర్తి

సంతోషము సఖి ఎంతని చెప్పుదు
ఈ ఆనందము నేమని చెప్పుదు
శ్రీరాముడు సీతావల్లభుడగు రేపే అయోధ్యాపతి.

సింహాసనమున శ్రీరఘునేత
వెలయ వామదిశ నలరెదుసీత

కౌ_స్తుసిగ్గుచే గర్వముచేత
రాజభూషల నలంకరింతురు
రమ్యంబగు నీయాకృతి ॥సంతో॥

గురు ముని జనము లెదురుగావత్తురు
స_ప్తనదీ గత జలము జల్లుదురు
ఉభయ వంశముల నుద్ధరించెదరు
మేఘము కంెంను మేటిస్వనమ్ముల
వడిమ్రోగును భేరి రుతి ॥సంతో॥

మగని సమము నిను మన్నించును ప్రజ
ప్రాపించు రాణి పదవి యవనిజా
తనయుల గనకనె తల్లి వయోనిజ
మహి ప్రజావళికి మాతృత్వపదవి
కావింపుము స్వీకృతి ॥సంతో॥

అవని యెల్ల నీకంకి తమ్మగును
జననికెయిక దొరసానివనదగును
ఎవరుపొందలే దీ భాగ్యమ్మను
ఫలపుష్పమ్ముల కళకళలాడును
ఎపుడీ మాతృక్షితి ॥సంతో॥

పతిత పావన ప్రభు సంగమున
పతిత పావనవు సతిభూతలమున
వసుధపైనె స్వ వైభవమ్ముగాన
నిఖిల లోకముల నిండియుండుతన్
నీ విమల యశోద్యుతి ॥సంతో॥

సీతరాణి ! దాసీలము మేము
నీ పదముల సంలీన మగుదుము
ఏ యాజ్ఞలనిడ నే వేళనుమము
నీయాజ్ఞలలో నిర్మగ్నంబై
యుండునెపుడు మామతి ॥సంతో॥ 6.

హాస్యమనుకొనకు మభిలాషయెయిది
హద్దులేదు నీ యదృష్టమునకెది
దేవదేవతలె నీరక్షసుధీ
భవ్యములగు నీ భాగ్యములకుమా
దృష్టి దవుల రాదు సతీ ॥సంతో॥ 7.

పరిచితమే ఆ పదములచప్పుడు
సౌష్ఠవములు ఆ ఛాయంగనబడు
నినుగలియగ వచ్చునదో రాముడు
అమాయకపు నీయక్షులలోనన్
లజ్జ బొందు జాగృతి ॥సంతో॥ 8.

# 14

"సీతావల్లభుడగు రేపే యయోధ్యాపతి"

ఈ వార్తవలన ప్రాసాదములో వలెనే నగరమంతటను సంతోషము ఉప్పొంగిపోయెను. ప్రజలు ఆనందోత్సవములలో మగ్నమైపోయిరి. శ్రీరాముని సవతితల్లులు కూడా కౌసల్యారాణి వలెనే సంతోషసముద్రములో నీదాడుచుండిరి. మంథరయను దుర్మార్గురాలైన దాసి కైకేయికి యీవిధముగా చెప్పి బుద్ధిని భ్రమింపజేసినది. "భరతుడు తాతగారి యింటికి పోయినపుడు

దశరథమహారాజు రామునకు రాజ్యాభిషేకము చేయుచున్నాడు. కావున దీనిలో సదుద్దేశములేదని తెలియుచున్నది. రాజ్యము నిజము నరయనీ భరతునకు దొరకవలసియున్నది. ఏదైనాచేసి రాముని నింటినుండి గెంటించవలసి యున్నది'' కైక దీనికి సుతరాము ఒప్పలేదు. కానిచిట్టచివరకు ఆమె మన స్సులోకూడ రాముని పట్టాభిషేకము పట్ల అసూయ తాండవింపసాగినది. క్రుద్ధస్వరములో ఆమె దశరథుని హెచ్చరించెను.

# అయోధ్యాకాండ

## కైకేయి

వచన భంగ మొనరింపకునాథా ! వచనభంగమొనరింపకుము
సింహాసనమున జేర్చుము భరతుని
వనికి బంపుమీ రాఘవుని

సాంత్వన పరుచకు జాలి జూపకుము
మాట యిచ్చినదిమరి పాటించుము
వేగిరముగ పిలిపించుమిప్పుడే
మామయింటగల భరతునిని ॥వచన॥ 1.

కొడుకు మమతలోబడి పిచ్చివియై
కుంటిసాకులను గూర్చకు మిటుపై
వచన భంగమెటు వలె శోభిలు ? రఘు
వంశవీరులకు నీ ధరణి ? ॥వనన॥ 2.

శక్రుని కొరకై శంబరు తోడన్
దండక వనిలో తలపడి పోరన్
రథచక్రము కాశ్రయణముగాగన్
హస్తము నిచ్చిన యది, యీసతియని వచన॥ 3.

నాథా నాటి రణమున విజయులై
ఏమి యంటిరో ఎరుకయె ? మీరై
"రమణీ రెండు వరాల నిచ్చితిని
ఎరిగింపుము నీ యిష్టమని ॥వచన॥ 4.

స్త్రీ సులభమ్మగు ధీ చతురత్వము
దాచెను నేటికి తా మిడువచనము
ఆవరముల నిపు డడుగుదు రెంటిని
సమయమెరిగి సాధింతునని ॥వచన॥ 5.

ఒక వరమునకై నొసగు కట్నముగ
ఈ సింహాసనమిడు భరతునికిక
రెండవ వరమర్థింతు రాముని
పదునాల్గేడులు పంపుమని ॥వచన॥ 6.

తనరు పక్షపాతము నీ ప్రేమన్
న్యూనాధికములు నొప్పవు దీనన్
ఉదారవై ఖరి నొసగితి వరములు
ఈ విశ్వాసము లేలా విధియని ॥వచన॥ 7.

ప్రాసాదము వెలి రాముని బంపుము
లేదా, వంశపు రీతిని ద్రుంపుము

కాదా ధన్యత గడియించుటకే
నిలుపు కొనుము నీ మాటయని ॥వచన॥ 8.

కపటపు ఏడ్పులు నటనలమూర్ఛలు
ఆ రాఘవునైశ్వర్య జిగీషవు
రాముని తృప్తి పరచగావలెనని
నీ మదినుండుట నెరిగితిని ॥వచన॥ 9.

మిన్ను విరిగినన్ మేదిని గూలను
మరల నిన్నునేమరి బ్రతిమాలను
నీవీ వరముల నీయనంతకును
వచింతు శ్వాసను వదలనని ॥వచన॥ 10.

## 15

"వచన భంగమొనరింపకు నాథా"

కైకకటు భాషలు దశరథుని శిరముపైన వజ్రాఘాతములై బాధాకరములుగా పరిణమించినవి. దశరథుడు మిక్కిలి దయనీయమైన పరిస్థితిలో పడియుండెను. ఆయన కైకను బుజ్జగించి, ప్రార్థించి యామె మనసు మార్చుటకై ప్రయత్నించి చూచెను. కైక తన శఠబుద్ధినేమాత్రము మార్చుకొనలేదు. రాజు తానయోమయస్థితిలో పడి విచారముడిగి విగ్రహము వలె మౌనముగా కూర్చొని యుండెను. ఇంతలో మంత్రియగు సుమంత్రుడు కైక మందిరమునకు వచ్చెను. ఓపికసడలిన కైక సుమంతుని శ్రీరామచంద్రుని కొనిరావలసినదిగా నాజ్ఞాపించెను. యౌవరాజ్యాభిషేకమునకు సంసిద్ధుడైన రామునితో సుమంత్రుడు కైక మందిరమున కేతెంచెను. దశరథుడు దీనవదనుడై శిరమును వంచుకొని కూర్చొనియుంట గాంచి రాము

డాశ్చర్యపడెను. రాముడు నేత్రసంజ్ఞతోనే కైకనాస్థితికి కారణమేమని యడిగెను. ఆమె జగిరిన సంగతులన్నియు తెలియపరచెను. రాజునకు ప్రత్యక్షముగా చెప్పు సాహసము లేకున్నదిగాని "నీవు పదునాల్గు సంవత్సరములడవికి పోవలె మరియు భరతునికి రాజ్యము దొరుకవలె" అనివారి అభిప్రాయము. కైక యీవిధముగా జెప్పినతరువాత గూడా రాజు ఏమి మాటలాడలేదు. మౌనమర్ధాంగీకారసూచకముగా గ్రహించి రాముడు పదునాల్గు సంవత్సరములు అడవికిపోవుటకు ఒప్పుకొనెను. జరిగిన సంగతులు తెలియపరచుటకు రాముడు లక్ష్మణునితో కౌసల్యా మందిరమున కరిగెను. కౌసల్యారాణి శుభ్రమైన వస్త్రములు ధరించి అగ్నికి ఆహుతి నిచ్చుచుండెను. రాముడు రాగానే సంతోషభరితయై రాముని ఆసీనుడగుటకై యాసనమును ముందుకు జరిపెను. కూర్చొనక రాముడు తన వనవాస విషయమును తల్లికి తెలిపెను.

కౌసల్యకేమియు తోచక భ్రమాన్పడి చూచెను. కైక హఠము దశరథుని వరదానము మొదలగునవేవి యామెకు బోధపడలేదు. శ్రీరాముని గుండెకదుముకొని ఆర్తస్వరముతో తన వెతనిట్టు లామెకు నుడువసాగెను.

## కౌసల్య

కడపతోసహా కన్నతల్లి యీకడుపుప్రేమ మాయ
దాటిపోకు రామరాయ.

పుట్టెడునోముల పొట్టకువచ్చి
సుఖపెట్టుటలిటు క్షోభమునిచ్చి
చంపుటకా, ప్రాణము చనగోరు
వెక్కియేడ్చు దేహము నినుబాయ. ॥కడప॥ 1.

ఎంత మూఢ ఈ సవతి కైకేయి
ఆమెయు నావలె అబలా 'అయీ'
ఆజ్ఞనిచ్చెనా ఆమె భరతునకు
వనికేగన్ గుణగేయ. ॥కడప॥

సవతి కన్నులిక చల్లబడగనీ
రాజ్యసుఖాల భరతుడు పొందనీ
వ్యర్థముగా నిను వనముల బొమ్మని
వైరిణియేల ఇంతజేయ. ॥కడప॥

ఎపుడు చెప్పలేదిప్పుడు చెప్పెద
వారికామె నను మీరి ప్రియప్రద
ఇంతవరకు వచియించ నెవ్వరికి
ఎదనుమూగ యాతన కోయ. ॥కడప॥

కనులనామె వెలిగ్రక్కు నిప్పులనె
సుతుడా ! కాలుచు బ్రిదికితి నిటులనె
రహి చివరకు నీ రాజ్యములోనే
నాస పడితి ఛాయా. ॥కడప॥

చెడుబోధల నెటుచేతు బాలకా
జనక తుష్టినిడు, పనుపుమీరక
తల్లినల్లె కాంతారము గొనివన
ఆజ్ఞవేడు రఘురాయా. ॥కడప॥

నిన్నువీడి నే నెట్టులుండెదను
ఈ సుతవియోగ మెటులు భరింతును

జమదగ్ని వలెనె జనకుడు నీకును
ఆజ్ఞయిడడు మాతృవధను జేయ. ॥కడప॥ 7.

స్వయముగ జేయుము జనని వధమ్ము
అవల దొరవెకమ్మడవికె పొమ్ము
విగతదేహయై విపినమ్ముల నిన్
వెంబడించు నొకఛాయ. ॥కడప॥ 8.

# 16

ఈవిధముగా వెత వెడలబోసికొనుచు కౌసల్య ఎంత యాక్రందన మొనర్చినను శ్రీరాముని నిశ్చయము సడలలేదు. ఎట్టిపరిస్థితిలోనైనా భార్య భర్తను విడిచి యుండరాదని శ్రీరాముడు గట్టిగా తల్లితో నివేదించెను. రెప్ప ఆడని కనులతో చిత్రిముభంగి చూచుచున్న లక్ష్మణుడు దుస్సహమగు సంతాపమునాపజాలక ఇట్టులనెను.

లక్ష్మణుడు

రాముని వినా నెవడునిల్చు రాజ్యపదవిని
కరమున ఖడ్గమునుబూని కొంతునునేను.

రామ సమర్థుడవు వృధగ వ్యామోహాంజలి జిక్కెదు
తులువల పాపమును నీకు తెలియజేతును. ॥రాము॥ 1.

వాక్కుగాదు వరములేదు కైకయొ రాజ్యాశ నీదు
విషయమగ్న నృపుడు దాని విలువనేయును. ॥రాము॥ 2.

సుతునీహత్య గోరువారు పితరులగుదురేతీరు
ప్రభువు నీకు వాక్కిడియెటు భంగపరచును ? ॥రాము॥ 3.

నృపుడు విషయలంపటుడెటు నీకిచ్చిన మాటదప్పె
పౌలతి హఠమొ 'కిమ్మనకన్' పూర్తిజేయును, ॥రాము॥ 4.

ఆమెకెపుడో వరములిచ్చె నవినేటికి జ్ఞప్తివచ్చె
ఏలచెప్పలేదు వాని నింతవరకును. ॥రాము॥ 5.

మదమాతంగము విధమున మసలు నీదు దుర్విధియన
త్రాటిచేత బంధించెద దాని నేనును. ॥రాము॥ 6.

ఈవు రాజపీఠమెక్కు మెవడడ్డుపడునో చూతును
రానీ ! వానిని రక్త (కంఠ) స్నానము జేయింతును. ॥రాము॥ 7.

ఆ త్రిలోకములె రానీ హడలింతును నేవాని
ముందేగతి యోచించునో ముసలితండ్రి నేజూతును. ॥రాము॥ 8.

క్షితినేలుము శతశతకము శ్రీరామా ధనువు గొనుము
నీవెనుకనె రక్షణకై నేసిద్ధముగా నిలుతును. ॥రాము॥ 9.

దండింతును వచ్చువారి తమ్ముడగాదు దాసుడను
కౌసల్యాతల్లితోడు గావింతును శపథమ్మును. ॥రాము॥ 10.

# 17

"రాముడువినా రాజ్యపదవి నెవడునిల్పును. కరమున ఖడ్గమ్ముబూని కాంతును నేను.

ఈ రీతిగా నీర్ష్యతో దహించికొని పోవుచున్న లక్ష్మణుని రాముడెంతో ప్రయాసముతో శాంతింపజేసెను. మాతృశ్రీ కౌసల్యతో నీవిధముగా మనవి యొనర్చెను. "అమ్మా! నేను వనికి బోవుటవలన మహారాజున కెంతటి దుఃఖము కల్గినదో తెలుపలేను. ఇట్టిపరిస్థితిలో నీవు నాతోనడవికి వచ్చుట అనుచితము" అనిన కౌసల్య ఇదియొప్పుకొనక తప్పదయ్యెను.

తరువాత రాముడు సీతామందిరమునకు చనెను. ఆమెతో నీవిషయ మంతయు నుడివెను. చివరకు తనకడవికి పోవుటకై సెలవొసంగుమని కోరెను. అదివిని జానకి ఔదాసీన్యహాసముతో నీరీతి పలికెను.

## సీత

నాతో చెప్పగనేలా నాథా
ఎచ్చటరాముడో అచ్చటసీతా!

మీరలెప్పుడే దారినడతురో
తన్మార్గములో తముముందేను
వనవాసపు భీతిని గొననేను
భవత్సంగతిని భాగ్యవిధాతా. ॥నాతో॥ 1.

నావెంట న్నానాథుడుండగా
భవనముకన్నను వనముమిన్నగా

శిలపై మీరాసీనులుగాగ
జనమది సింహాసనమను నేత. ॥నాతో॥ 2.

వని నిశాచరులు వ్యాఘ్రములుండిన
వానికి నేనావంత భయముగొన
ఉభయ ధనుర్ధరులుంద్రు వెనుకమును
వెను తూణీరము విల్లరచేత. ॥నాతో॥ 3.

ఏ పదాంబుజము ప్రాపుగొనుటకయి
ధరణిగర్భమున దాగితినేనయి
ఆచరణ వియోగాప్తికి లోనయి
వనరుమనుటె దివ్యము నీబోధ. ॥నాతో॥ 4.

ఎవరికొరకు నేనింట వసతిగొన
దనరుటె? విరహా తపమజ్జనమున
కనవలెనే? భరతుని తల ఛత్రము
తగునె? యకారణ దాస్యపునేత. ॥నాతో॥ 5.

తృతీయ వరసిద్ధిగొనెనా? కైక
మంథర జొచ్చెనా మదినటుగాక
ఏమిది వృథమది నేచుటెకాక
ఏకాకిగ నన్విడుటె వినీత! ॥నాతో॥ 6.

విజనవాసమది విధిలోనుండె
పరిచయమిది నా బాల్యమునుండె
క్షితిసుఖ దుఃఖాంకిత మీజన్మ
సఖుతో దుఃఖమె సుఖము పునీతా! ॥నాతో॥ 7.

నీవు విడిచినను నేను త్యజించ
శతజన్మల యీ సఖ్యము త్రెంచ
అడవికి నీతో నరుదెంచెదను
దంపతులిరువురె ? ధరసుఖదాత ! ॥నాతో॥ 8.

పతియె భూషణము పతియే ఛాయ
ఆపతి పదముల కఖండపూజ
ఆర్యస్త్రీలకు అదే జీవనము
దానికి నంతరాయమేల రఘునాథా ; ॥నాతో॥ 9.

పూనితి రేటికి మౌనము మీరలు ?
మ్రొక్కెదు చరణంబు లెన్నిమారులు ?
భాషణలో పొరపాటు జరిగెనా ?
క్షమించవలె నను జానకినాథా ! ॥నాతో॥ 10.

# 18

"ఎచ్చట రాఘవుడచ్చట సీత."

ఈ విధముగా సీత నిర్ధారించిన పిమ్మట రాముడు తానేమనగలడు ? "సీతా ! నీ యీ నిశ్చయము క్షత్రియవంశములకు శోభాయమానమై యొప్పినది. బ్రాహ్మణులకు వస్త్ర భూషణాదులు దానమిచ్చినవెంటనే నీవు నాతో బయలుదేరుటకు సిద్ధము కావలెను" అని రాముడు పల్కెను.

శ్రీరాముడు లక్ష్మణుడు జానకియు ముగ్గురు అడవికి బోవుటకు సంసిద్ధులైరి. ముగ్గురును రాజుల వేషమువీడి వల్కలములను ధరించిరి. అందరితో సెలవుగొని శ్రీరామచంద్రుడు అడవికి బయలుదేరెను.

మంత్రి సుమంత్రుడు రథముపై కూర్చొనెను. రథము కదలెను. ఆ రథమువెంట మొత్తము అయోధ్య కదలివచ్చెను.

అయోధ్యావాసులగు ప్రజల దుఃఖము పారముట్టిపగిలి బయట పడెను. రథముదోలుచున్న సుమంత్రుని కేక వేయుచు పిలిచివారిట్లు విన్నవించ దొడగిరి.

## అయోధ్యాపురుషులు

రాముడు నడచునదే సత్పథము
ఆపు సుమంతా ఆపుము రథము.

భూమిజ అగుము రామా ఆగుము
చరణధూళి మస్తకమున దాల్తుము
ఏమి ఘటించెను ఇది యకల్పితము. ॥రా॥ 1.

రామరాజ్యమే రాదగు నీపురి
ఆకల కన్నుల నాడెపుడును హరి
ఏమిటు భగ్నము మా మనోరథము ? ॥రా॥ 2.

వ్యోమనీలిమ ఉషఃప్రభలోయి
శ్రీ రఘురాముడు సీతామాయి
చతుర్దశాబ్దము లస్తంగతము. ॥రా॥ 3.

పదునాల్గేడులు ఒదుగును ఛత్రము
పదునాల్గేడులు బరగు నిశీథము
ఎటుమను నగరం బిటులు మూర్ఛితము. ॥రా॥ 4.

స్త్రీ లు

దాగెనెచట దుస్తంత్రపు కైక
కాంచుమనుము ఈ దుర్దశరాక
ఇది కాదనర్ధమిది నీ చైదము. ॥రా॥ 5.

తల్లి భరతునిటు ధరణిపు జేయును
హరితో వనికటు సిరి వేంచేయును
ఓడె నయోధ్యయె నేడిది ప్రథమము. ॥రా॥ 6.

పు రు షు లు

జననీ జనకులు సమ్మూర్ఛితులు
వీరిస్థితి గనుచు వెడలుదురెటులు
కొని చనుమీ నగరి నిరాశ్రితము. ॥రా॥ 7.

అక్షులపై నీ యశ్రులతెరలు
రాముడు రథమును నెచ్చట వరలు
గళము రుద్ధము స్వరము కంపితము. ॥రా॥ 8.

# 19

"ఆపు సుమంతా ! ఆపుము రథము."

నగర ప్రజల యార్తనాదమునకు రామునిరథము నాప నలవికాలేదు. సీతాలక్ష్మణులతోగూడి రాముడయోధ్యానగరపు పొలిమేర దాటెను. ఆ రాత్రి అయోధ్యలో నేయింటిలోగూడ అగ్ని రాదుకొనలేదు. ఎవరును వంటజేసి కొనలేదు. నీరింకిపోయిన సముద్రమువలె నిర్జీవమై నగరము తోచెను.

శ్రీరాముడు అయోధ్యాపురి వెలుపలకు రాగానే ఆ నగరమున కభిముఖముగా నిలిచి అభివాదనమొనర్చి పురజనులతో సెలవుగొనెను.

రథము మార్గము నాక్రమించసాగెను. శ్రీరాముడు గంగాతీరమున నున్న శృంగబేరి పురమును సమీపించెను. నిషధాధిపతియైన గుహుండత్యంత భక్తితో శ్రీరాముని దర్శనార్థమై యరుదెంచెను. అపరిమితమగు ప్రేమాదరముల వారి కాతిథ్యమిచ్చెను. ఆ రాత్రియంతయు వారు "ఇంగుదీ" వృక్షముల క్రింద గడపిరి. తెల్లవారినంత గుహుండు గంగదాటింప తన నౌకను సిద్ధపరచెను. శ్రీరాముడు సుమంతునితో అయోధ్యకు తిరిగి పోవలసినదిగా నాజ్ఞాపించెను. నావికులు నౌకను నడపదొడగిరి. అలలు నావపై పడుచుండెను. ఆనందావేశములతో గుహుండు తన నావికులగూడి పాడసాగెను.

# అరణ్యాకాండ

## గుహుండు

పొంగునుగని వెనుదిరుగకు నౌకా
గంగా నీవుపొంగకుమా.
శ్రీరాముని నామమును బాడుచు
శ్రీరాముని దాటించు సుమా
జయగంగే జయభాగీరథీ
జయజయ రామా దాశరథీ. ॥జయ॥

ఇది విధికృతి వ్యతిరేకపు వ్రాత
తలపై మేఘము తొలగునుగాత
మనభాగ్యమ్మను మనచేతులతో
మనకు దూరముగ జేయుదము. ॥జయ॥

ఇల విష్ణువుదే ఈ యవతారము
సరిజేర్చును భవసాగర పారము
తారకునేయిటు తరింప జేతము
పదస్పర్శ తరియించుదము ॥జయ॥ 2.

ఎచట రాఘవ నరేంద్రి ప్రవేశము
ధన్యసుభగ, యా దక్షిణదేశము
అయోధ్య యిటు మను నహల్యాకృతిని
అటు జనించె కల్పతరు రమా ॥జయ॥ 3.

కర్తవ్యపు దీక్షను ధరియించె
వనవాసము రఘుపతి వరియించె
అతని దాసులమె యనదగు మనము
తత్కర్తవ్యము త్యజింతమా ॥జయ॥ 4.

అతిథిగాని శ్రీహరియేగానీ
గంగా తరణము గావించుటెపని
మంచిచెడ్డలా మాధవుడెరుగు
మనపని జేయుట మనకు శ్రమా ॥జయ॥ 5.

గంగా నీకిది మంగళయోగము
భగీరథుడు గొనివచ్చె జలౌఘము
అతని వంశజునె యద్దరి జేర్చుము
ఆ దక్షిణ భువి నమరము జేయుము. ॥జయ॥ 6.

అమలము గంగా విమలుడు రాముడు
రాముని పావన నామమె దరినిడు
దివ్య ప్రవాసము త్రిదోషనాశము
నావికులము సంతతము స్మరింతము ॥జయ॥

# 20

"శ్రీరాముని నామమును పాడుచు శ్రీరాముని దాటించు సుమా"

గుహుని సేవకులగు నావికులు తాము శ్రీరామచంద్రుని గంగానది యవలి యొడ్డునకు జేర్చిరి. వనవాసమునకు బయలుదేరిన రాఘవుడు భార్యతో మరియు సోదరుడైన లక్ష్మణునితో ముందుకు నడవసాగెను. వారు పవలంతయు నడచుచు రాత్రింతయు వృక్షచ్ఛాయలలో పర్ణశయ్యపై నిదిరించుచు అయోధ్యను స్మరించుచు కాలము గడపసాగిరి. ఒకనాడు సాయంకాలము వారు భరద్వాజముని యాశ్రిమము చేరిరి. మునివారికి యథోచిత స్వాగత మొసంగెను. ఆముని వారితో చిత్రకూటపర్వతము మీకు నివాస యోగ్యమగునని చెప్పెను. ఆగిరికి నరుగు మార్గము జూపెను. మునివద్ద సెలవుగొని రాముడు ముందుకు నడచెను. త్రోవలో జానకి యపరిచితము లగు పూలనెన్నిటినో గురించి యడుగదొడగెను. శ్రీరాముడు ఆమె జిజ్ఞాస తీర్చుచుండెను. లక్ష్మణుడు వదినెకా పూలగుత్తుల తెచ్చియిచ్చుచుండెను. ఈ విధముగా వారు వనవిహారమొనర్చుచు చిత్రకూటపర్వతము జేరిరి.

అచటనొక చదునగు స్థలమును వ్రేలుతో జూపుచు రామచంద్రుడు లక్ష్మణునితో నిట్లనెను.

లక్ష్మణ రమ్మిట నిల్పు కుటి
ఈ మందాకిని నికట తటి

ఇది చిత్రకూట మిదియె తపోవప
మిట సాధకులై యెసగును మునిజన
మవనిజ ? దీనిని యవలోకించిన
వనసహజ శోభ దను మరచుతుఁటి ॥లక్ష్మ॥ 1.

వంగెను బిల్వము పలాశి పూచెను
భల్లాతకి ఫలభర తలయూచెను
నరుడివి స్పృశించనటువలె తోచెను
దృఢలతాశ్లిష్టమీ పంచవటీ ॥లక్ష్మ॥ 2.

ఎన్నని పూవుల వన్నెలు చెప్పుదు
ఏవని పూవుల తావుల విప్పుదు
ఈ మూగ చెలువ మిమ్మడి జొప్పుడు
కూజితములు వినబడ కర్ణపుటి ॥లక్ష్మ॥ 3.

రహికోకిలములు రాగముతీయును
వీకమయూరము కేకలు వేయును
పుచ్ఛము రత్నమ్ముల తులజేయును
మిశ్రరవమ్ముల మేయ వటి ॥లక్ష్మ॥ 4.

ప్రతి శాఖన్గనబడు తేనెపెరలు
వానినుండి మధు వర్షములు దొరలు

వనతరు సంజీవినులమృత ఝురులు
మక్షిక పూరిత మధుకోశపుటి ॥లక్ష్మ॥ 5.

అనుజ సావధగ మనుము ధనువుగొని
కనబడు దాగు మృగమ్ములపుడెవని
నిత్య సిద్ధతన్నిలు మన్త్రమూని
శ్వాపదముల లో సెది ? వన్యతటి ? ॥లక్ష్మ॥ 6.

పూవులు తీవలు భూమిజ కొరకు,
శరవిహరణ, మనయిరువురి కొరకు,
లాభద్వయి వనులంగల వఱకు
శుభకరము అస్మదాగమన ఘటి ॥లక్ష్మ॥ 7.

గట్టి కఱ్ఱలం గట్టుచు వేగము
సులలిత కుటి నీస్థలి నిర్మించుము
పర్ణశాఖలాపైన బరచుము
చిత్రము విరచింతము గగనపటి ॥లక్ష్మ॥ 8.

## 21

"లక్ష్మణా రమ్మిట నిల్పుకుటి"

శ్రీరాముని ఆజ్ఞను పురస్కరించుకొని లక్ష్మణుడు వెంటనే ఆకులు కొమ్మలు ప్రోగుచేసి ఆ చిత్రకూట పర్వతముపై శ్రీరామాశ్రమమును నిల్పెను. ఒక కృష్ణమృగమును అవయవములతోకాల్చి మంత్రయుక్తముగా ఆ నూతననివాస స్థానమునకు వాస్తుశాంతి నొనర్చెను. రాముడు, లక్ష్మణుడు, జానకి ఆపర్ణకుటియందు ప్రవేశించిరి.

ఇక్కడ రామవియోగముతో శూన్యమయిన అయోధ్యలోని ప్రాసాదములో సుమంత్రుడు తలవంచుకొనియే ప్రవేశించెను. సుమంతుడు వచ్చినది తెలియగనే అశ్రుపూరితమైన నేత్రములతో మరియు కంపించు కంఠధ్వతో రాజైన దశథుడు సుమంతునితో నడిగెను. సుమంతా? నా రాముడు నీవు వచ్చునప్పుడుతానే మనినాడు?

అంత సుమంతుడు చెప్పసాగెను.

సు మం త్రు డు

చివరకు చేసితి నమ్రప్రణామము
పలికె రాముడీ వాక్యస్తోమము.

"సుమంత చేయు మయోధ్య ప్రయాణము
మా కుశలమ్మట మనవి నొనర్చుము
నాప్రతి పితృవందనమును జేయుము
పితృచరణద్వయ మతివంద్యమ్మల
శత తీర్థమ్మల ధామము." (అని) ॥పలికె॥ 1.

"తల్లులిద్ద రంతఃపురమందు
ఎంతో దుఃఖమున నేడ్చుచుందురి
ధైర్యమిమ్ము శాంతముగని యెందు
వారికి మా సుఖవసతిని దెల్పి
కూర్చుము శోక విరామము." (అని) ॥పలికె॥ 2.

"అంబకు కౌసల్యకు వచియింపుము
వనవాసి సుతు డవనిజయు కుశలము

అగ్నిహోత్రు నిత్యము పూజించుము
సదా మనుత నీశ్రవణ కూహరముల
మునివర ఘోషిత సామము." (అని) ॥పలికె॥ 3.

"నేను పెద్దననుదాని మరపుగొని
వర్తింపుమీ, సవతి తోడ జనని
పతిపూజామగ్నత నుండుమవని
నీ హృదయము విడి నెటి యాజీవికి
వేరెలేదు విశ్రామము." (అని) ॥పలికె॥ 4.

"జనపతి ధర్మము స్మరింపుమమ్మా
ప్రభుతకు గుణములు వలయు వయమ్మా?
ఆ భరతునకే యాదర మిమ్మా!
నీవు వినయిపై నేర్పు సుమంతా!
వచియింపుమి నా నామము." (అని) ॥పలికె॥ 5.

"భరతునిగని యిక్కారణి వచింపుము
ధర యువరాట్పత్తా గ్రహియింపుము
మహీజనులపై మమతలు బెంపుము
అఖండభోగము లనుభవించుచునె
మదివింపుము నిష్కామము." (అని) ॥పలకె॥ 6.

"తండ్రి గొడుగు నీతలపై వెలుగును
జనకవాక్య పాలన మొనర్చుచును
సార్ధక పరచుము జనకవృద్ధతను
నీతిగ రాజ్యము నేలుచు బెంచుము
రఘువంశీయుల నామము." (అని) ॥పలికె॥ 7.

"ధీమంతుడ వీవేమి జెప్పుదును
అన్ని తెలిసిన యుదారుడ వీవును
నందన విరహిత నాదు మాతయును
నీ ప్రేమాదృతినిగని తలచవలె
భరతుడె రాముని రూపము." (అని) ॥పలికె॥ 8.

నుడువుచు నుడువుచు పడె గద్గదము
మునిగెనశ్రువుల నయన సరోజము
మరువజాలనా కరుణాదృశ్యము
జాహ్నవి తటమున సౌమిత్రీయుత
సీతారాముల రూపము. ॥పలికె॥ 9.

## 22

"పలికె రాముడీ వాక్యస్తోమము."

సుమంతుడు చెప్పిన ఈ వార్తను వినిన దశరథుని స్థితి మిక్కిలి కరుణాస్పదమాయెను. ఆయన కనులనుండి కన్నీరు స్రవింప నారంభించెను. శోకము కంఠమునిండి వచ్చెను. తనపైననే తనకు కోపము వచ్చినట్లు ఆయన చేతులనటునిటు త్రిప్పుచు మాటాడసాగెను. ప్రాసాదములోని జన మంతయు రాణులు ముప్వురు గూడుకొని ఆయనచుట్టు గుమికూడిరి. ఉలికిపడి లేచి దశరథ మహారాజు సోలి నేలపై కూలబడెను. తెలివి వచ్చినట్లనిపించి శ్రమించి మాటాడసాగెను.

# దశరథుడు

క్రమ్ముకొనె దశదిశల నంధకారము
క్షీణదేహ మిడజాలకుండె నా ప్రాణములకు నాధారము.

నేడు జ్ఞప్తినొనగూడె శ్రావణుడు
శబ్దవేధి భీషణమృగయ యిపుడు
ఆవేటన్ హతుడయ్యె బ్రాహ్మణుడు
విదితమయ్యె నా విప్రోత్తమాంధజనకుని దుఃఖమపారము.

॥క్రమ్ము॥ 1.

కనులులేని యా కంపితవాణి
కాలయముని శంఖాకృతి బూని
గర్జించును నాకర్ణములోనె
అతనివలెనె నేడాత్మజ వియోగతృషార్తి నా సంహారము.

॥క్రమ్ము॥ 2.

వర రాఘవ సంస్పర్శనమువినా
అతృప్తమే తపనావృత చేతన
లేదు దర్శనము లేదిక భాషణ
రక్షకుడగు నా రాజకుమారున కిచ్చితి వనసంచారము. ॥క్రమ్ము॥ 3.

కామి వంత్యమున రామదర్శనము
అదెటు లభ్యమగు నాత్మవంచనము
ఈవేళ దెగదు జీవబంధనము
సంచితమ్ము తా సరిగ దెఱువగా జాలునె మోక్షద్వారము.

॥క్రమ్ము॥ 4.

కుండలమండిత శ్రీవణ మనోహర
నయనమధుర రామాస్య సుధాకర
మాత్మ తమోపరి నదియొ వికస్వర
మగునే గతినీ యఘరూపునిపై చల్లునెరశ్మి తుషారము.
॥క్రమ్మ॥ 5.

కారాని విపుడు కానివవేయవి
కడనెట్టితి స్వర్గసుఖముల నునవి
కైకా! వినవే! ఖల కుటిల పవీ!
భాగ్యసహిత సౌభాగ్య మీక్షణమె కోల్పుదువు సుఖసారము.
॥క్రమ్మ॥ 6.

సీతారాముల జూతురెవారు
మానవలోకామరులే వారు
కననదె స్వర్గసుఖమ్ముల తీరు
అదృష్టమా! నీకును ప్రాప్తించునె రామా గమన విహారము?
॥క్రమ్మ॥ 7.

క్షమాపణ మొనర్పుము కౌసల్యా!
సుమిత్ర క్షమింపు సుత వాత్సల్యా!
క్షమించు దేవీ సతీ యూర్మిలా!
క్షమించుడో సజ్జనులారా! నే చనుదు సుఖదుఃఖపారము
॥క్రమ్మ॥ 8.

నను క్షమియింపుము తనయా! రామా!
పతిత పావనా మేఘశ్యామా!
రామా! సీతా! సీతా! రామా!

అంత్యమందు మీనామోచ్చారణ
పెదవుల గంగానీరము
శ్రీరామా—శ్రీరామ—శ్రీ—రామ—రా—మ

## 23

"క్రమ్ముకొనె దశదిశలనంధకారము"

ఈ అవస్థలోనే దశరథమహారాజు ప్రాణములను విడిచెను. నగర మందంతట హాహాకారములు వ్యాపించెను. వసిష్ఠుడు మొదలగువారు సంయమనముతో ఆ ప్రసంగమును సహించుకొనిరి. నందిగ్రామమునుండి భరతుని గొని తెచ్చుటకు దూతలు పంపబడిరి. దశరథమహారాజు మరణవార్తను బుద్ధిపూర్వకముగానే వారు భరతునికడ రహస్యముగా నుంచిరి.

శ్రీరాముని రాజ్యాభిషేకము కానున్నదేమొ అందులకే నన్నింత త్వరితముగా పిలిపించుచుండిరేమోయని భరతుడయోధ్యకు తొందరగావచ్చెను. సౌభాగ్యమును కోల్పోయిన యానగరి దృశ్యము ఎంతో ఉదాసీనముగా భయంకరముగా ఉన్నట్లుతోచెను. తనగారాబపు కుమారుని కలిసికొన్న తక్షణమే కైక జరిగిన వృత్తాంతమంతయును పండొల్చినట్లు చెప్పెను, దివంగతులగు రాజుగారి ఔర్ధ్వ దైహిక కృత్యములు ముగిసినంత రాజ్యస్వీకార మొనర్పవలసియున్నదిగా పుత్రునాజ్ఞాపించెను. కైక యొక్క స్వార్థపూర్ణమగు ఆభాషణములువిని భరతునకు భరింపరాని సంతాపము కల్గి తల్లి కిట్లనెను.

భ ర తు డు

మాతవేకావు వైరిణీ!
కావు అశ్వపతి కన్యవుసీవు! కనినను జననివి కావికనీవు
ధర్మాత్ముల సద్వంశములోన! మారిపుట్టి యేతీరున పెరుగు?
నాధుని వధము నొనర్చునెమూఢా! సత్ పతివ్రతాచారిణి 1.

శాఖతోడ వృక్షమును నరికితివి । ఫలసమృద్ధి వాంఛింతు
ఈ నీ ఆత్మఘాత జ్ఞానము । భటాగ్రిజులు కీర్తింత్రు
నీదుమెప్పుకై నేరాజ్యము గొననగుదును ద్విగుణయశస్విని 2.

అన్నను వనఘున కమరపురికి పితనంపితివివియా నేతలు
శ్రీరాముని యరచే వల్కలమిడ కాలవేల నీ చేతులు
క్షణమాత్రము ఈస్థలమున నిలువకు నల్ల మొగముతో జనువని 3.

నిరాధారుడీ భరతుడు వోఅడువాని కెట్లొదవు భోగము
గొడ్రాలా ! విధవాలంకృతితో గుల్కుచునిక నూరేగుము
సదనమ్మున రాజ పీఠముననీ ఛాయ పడరాదు పాపినీ 4.

పిశాచినిన్గని తృషార్తయయ్యెడి నీనా ఖడ్గపు ధార
ఐనను రాఘవుడమ్మ యనెను నినుహతమెటుచేతునె క్రూర !
కుపుత్రుడని నిందించెద రాయద్దరు మాతలునన్గని 5.

మాటలతోనే శాంతి పరతునెటు మాత కౌసల్య శోకము
సుమిత్రి కగపడు లోకత్రియమును శూన్యంబై ప్రత్యేకము
నగరజనుల కెటు నచ్చజెప్పవలెనే మాటలతోనేమని 6.

రాముడు లేమిని వనమున కన్నను పాడుబడెను ఈ ధామము
వనమున జని రామునిని వెదకికొని వత్తునింక సంక్షేమము
అస్మదీయ శపథమ్మునకెవ్వరు నడ్డము రావలదవనిని 7.

కదలు సుమంతా మన సైన్యమ్మునకై పిలుపొక్కటినిమ్ము
రాముని శోధించుటకై జనవలె లక్షకనులు మొత్తమ్ము
అభిషేకించగవలె రాముని వేదవేద్యులౌ మునుల గొని 8.

ఎచటనున్న నచ్చటనె రాము తలనిడవలయు కిరీటమ్ము
ఒకపె వాంఛనా కిచ్చటినుండియు నొకపే నాలక్ష్యమ్ము
కాలరాత్రి వలె నార్చుచు నొకతెవె గ్రాలుము విజనక్షోణి 9.

# 24

"మాతవేకావు వైరిణీ!"

ఈ రీతి కఠోర శబ్దములతో కైకను నిరసించిన భరతకుమారుడు రామునన్వేషించుటకై అయోధ్యను వీడివెడలెను. ఆయనతోపాటు అతని చతురంగసైన్యము కూడ వెంబడించెను. నగరవాసులును వెంటనంటిరి. రాణులైన కౌసల్యా సుమిత్రలును వారివెంట బయలుదేరిరి. భరతుడు, రామచంద్రునివలెనే తాపసవేషమును ధరించెను. రామలక్ష్మణులు చనినమార్గము ననుసరించుచు ఈ జనసముద్రము కదలసాగెను. రామాశ్రమము చిత్రకూట గిరిపైనున్నట్లు తెలిసినది. సైన్యముతో భరతుడచటికి వెడలెను. ఇచట పర్ణకుటి ప్రాంగణములో రామలక్ష్మణులు జానకితోపాటు విహార మొనరించు చున్నారు.

ఆకాశము ఉత్తరదిశనుండి ఒకేసారి దుమ్ముగ్రమ్మి కనబడినది. చెవులు గడెలు బడునట్లు నినాదము వినబడినది. ఎల్లప్పుడునుజాగరూకుడై యుండు లక్ష్మణుడు వేగిరపాటు కనబరచుచు రామునితోనిట్లులనెను.

లక్ష్మణుడు

ఆత్మరక్షణకయి గుహకునను పవయ్య జానకిన్
చాప బాణపాణివగుచు జాగ్రతమను రాఘవా!
ఘనములు గర్జించునట్లు కాననమున నగుధ్వని
ఎఱను విడిచి శ్వాపదములు పరువెత్తెడిని వ్వని

అరచుచుండె భీత కంపితాంగములన్నియచొని
ధూళి గగనమందులేవ వచ్చునే దొవాహిని
ఆనవాలు దెలియకుండ నగ్గి నార్పు భూధవా 1.

ఉత్తరమున గుంపుగూడి యుండిరో యనుమానమూని
తాళవృక్షమెక్కి ఎవరో దర్శించెద వారిని
నిలువ కిట్లువత్తురెవరు ? నిర్మనుష్యమగువని
సంసిద్ధత క్రింద నిలిచి సంధింపుమునారిని
వీరులెవరో చూతుమింక వారిపోరు మెలకువ 2.

పరువిడునెంతో పదాతి యురికెడినిగజాశ్వవితతి
ధర్మస్నాతుడు సారథి దాననొక మహారథీ
నిర్మలగతి శ్రేష్ఠుడొకడు నిలచియుండె నెవడొరథీ
దేవరవలె శ్యామ వర్ణ దీర్ఘ తర భుజాకృతీ
మనతో పోరగ భరతుడె చనుదెంచెను రాఘవా 3.

పిరికి బంటు భరతుడు సోదరులనేమి చంపును
నాముందుకురానీ గళ నాళమునే త్రెంతును
కన్నుల గననిమ్ము కైక ఛిన్నపుత్ర వపువును
గుజ్జపు డెక్కల సడియాకోనసే నదించును
తిరిగి రణావసరమె యరుదెంచె శస్త్రపాటవా ! 4.

ఏనిటనుందొక్కడ వారేగుదెంచనీ లక్షలు
ప్రజాపాలుడతినవ్యుడు బలహీనులు పురప్రజలు
అనాధ బాలకుడేనియు నాజి క్షమార్హుండెట్టులు
క్షత్రియునకు శత్రుహతమె సత్కార్యమ్మనువిధులు
వాడికనాముందు రానీ పంపెద నరకపు త్రోవ 5.

ఆపజాలనీ కోపము ననేకములు బోధించిన
ఊర్వీరాము మేనాపద లోర్చుటకె జనించెన
విశ్వమ్మొకసారి పాపవిముక్తగానీ విరాన
భరతభూమి రామరాజ్య భాగ్యమనుభవించుత
అజేయుడను వ్రజికి ధర్మావనా జి నేశివా! 6.

# 25

"చాపబాణపాణివగుచు జాగ్రతమను రాఘవా"

ఇట్లు శ్రీరామచంద్రుని హెచ్చరించి లక్ష్మణుడు తాను స్వయముగా భరతునిపైకి పరువెత్తికొని పోయెను. అపుడు శ్రీరామచంద్రుడతనిని ఇది సరికాదని ఓదార్చి నివారించెను, భరతుడు రాముని ఆశ్రమమునకువచ్చెను. అతడు రాముని గాంచి పిచ్చివాడై యతని శ్రీపాదముల బిగ్గరగా కౌగలించు కొనెను. రాముడతని దగ్గరగా తీసికొని క్షేమసమాచారమునడిగెను.

బెదరిపోయిన భరతుడెంతో కష్టముగా పితృ మరణవార్తను రామున కెరింగించెను. అప్పుడాశ్రమమెల్లెడ దుఃఖఛాయలలముకొనెను. సకాలమున రాముడు పితృశ్రాద్ధక్రియలాచరించెను. నాతల్లి మూర్ఖతవలన నీకీ వనగమనక్లేశము దాపురించెనుగదా శ్రీరామచంద్రాయని భరతుడు పదేపది నుడువసాగెను. అపుడు సర్వజ్ఞుడైన శ్రీరాముడు భరతునిగని యిట్లనెను.

రా ము డు

దుఃఖమిచ్చు దైవమె భరతా! దోషమెవరిదిందు
ధరణిలోన మానవమాత్రుడు పరాధీనుడెందు
కాదు జనకుడెందును దోషి, కాదు కైకమాత
ఘనరాజ్యచ్యుతి వనయాత్రా కర్మఫలము భ్రాత
నాడు పూర్వ సంచితమే యీ నాటకమనియందు 1.

అవనిలోన పతనము నొందు ఔన్నత్యమ్మొందు
అఖిల సంగ్రహములో వత్స ! అంత్యనాశమొందు
వియోగార్ధమే మేళనమని విశ్వనియమ మెందు 2.

మేదినిలో మృతి ప్రాణులకు మేనితోనె పుట్టు
కనబడి తోచెడి యీ జగతి కడకు లయము ముట్టు
వెఱ్ఱియగుచు స్వప్న ఫలాలకు వెతలనేల నొందు 3.

స్వర్గ వాసుడయ్యెను తండ్రి ప్రాతకడవి తావు
అకస్మాత్తు జరిగిన నవియు యతర్క్యములుగావు
విలయ కల్పనముతోనాగున్ విజ్ఞతర్కమిందు 4.

జరామరణ ముక్తిని గాంచున్ జగతిప్రాణులేవి ?
బ్రతుకులోన దుఃఖవిముక్తిన్ బడసెనెవ్వడీభువి ?
వర్ధమానగతినెవి యేగున్ క్షయపథమ్మునందున్ 5.

కలిసికొనెను సాగరమందు కాష్ఠములివిరెండూ
ఇరు కాష్ఠములొక వీచీహతి మరలి కలియకుండు
జగతి నావిధముగనె వత్సాక్షణము నరులపొందు 6.

కార్చకుమీ అశ్రువులిపుడు కనులు తుడిచికొమ్మ
విభిన్నములు నీనా త్రోవల్ విచారణీయమ్మ
అయోధ్యాధిపతి వీవోనేయతిని యడవియందు 7.

నిలయమునకు రమ్మని నన్ను బలిమిచేయవలదు వృథా
పితృవాక్పాలన నిర్ధరము కృతార్థులమగుదుముగదా
మకుట కవచ ధారణ సేయునె మౌనివేషమొందు 8.

మొత్తమీ చతుర్దశవర్షాల్ ముగియునంతదాక
అబద్ధమ్ము మమ్మోటికినా అయోధ్యకై రాక
రాజువంత వరకీ వౌకడవె రాజ్యధనము కెందు 9.

ఈ దూరాటవులకు మరల ఎవరును రాకండీ
సంతృప్తుడ మీపేర్మిమమ్మది చనదు మనసునుండి
విభుత నయోధ్యా గౌరవము పెంచులోకమందు 10.

## 26

"దుఃఖమిచ్చుదైవమె భరతా దోషమెవరిదిందు"

శ్రీ రామచంద్రుడు భరతున కెన్నిసార్లు నచ్చజెప్పినను ఎంత ఓదార్చినను అతనికంటి తడియారకుండెను. "మీరు అయోధ్యకు తిరిగిరండు. రాజ్యాభిషేకము గావించుకొనుడు" అని భరతుడు మాటిమాటికిని ప్రార్థిచెను. భరతుని వలెనే వెంటవచ్చిన మునిజనములు కూడా చాలా ప్రాధేయపడిరి. కాని శ్రీరామచంద్రుడు వినయవినమితాననుడై తన యసమ్మతిని ప్రకటించెను.

భరతా పితాదేశమువలన నీకు సింహాసనము నాకు వనవాసము లభించినవి. నీవు తిరిగి యయోధ్యకుజేరి నీరాజ్యపాలన మొనరింపుము. నేను పదునాల్గు సంవత్సరములు తండ్రియాజ్ఞ శిరసావహించి జానకితో లక్ష్మణునితో వనవాసముననుభవించి అయోధ్యకు రాగలను. ఇదే ధర్మమై సముచితమునై యుండును" అని శ్రీరాముడనేను.

శ్రీరాముని యీ సమాధానముతో నిరాశచెందిన భరతుని కంఠము నుగాద్గద్యమలముకొనెను. అతడు శ్రీరామచంద్రుని పాదుకల స్పృశించి కరుణాభరిత కంఠస్వరమున నిట్లనెను.

అరిగె పితయు మాతయు నిపుడీ భరతు డగతికుండు
నాపార్థన మొకటే రామా మీ పాదుకలిందు

మహాగరుడు నుడ్డీవనము మశకము సాధించునా ?
వరగజ భారమ్మోవదేని వాజి మూపు నుంచునా ?
రాజ్యపాలనము రామునిదే భరతుడజ్ఞుడెటు శక్యుండు ? ॥నా॥ 1.

వంశరీతి తెలుపును తొలుతటి వానిదె సింహాసనము
చిన్నవాడు సింహాసనమున జ్యేష్ఠుడున్నె కాననము ?
తమపద సేవకునకు రాజ్యప్రదానము జేయుట లెటులుండు ?
॥నా॥ 2.

ధరపాలన తిరస్కరించి తాల్చితి మునివేషము
తల్లికైక వలె నేనెటు తలదాల్తు ప్రజారోషము
దేశికులై బాలున కిటులాదేశించ దగునె రాముండు 3.

పాదుకల నలంకరింతును ఆదశరథు నాసనము
ఈ సుదతులె సేయుచు నుందురు కోసలమున శాసనము
పూత పాద చిహ్నములివి యీ పూజభరతుడుండు

రాము బదులుగ పాదుకాద్వయి రంజిలుత మందిరమున
నగరసీమను వీడి యుండెందైన నే నాదరమున
సవితృ కరరేఖలకు బదులుగ సంజదీపము వెలుగుచుండు.

దవ్వునుండి నీవట వచ్చేదిదాక నేను రాజ్యము నడపెద
ఎదిరి చూచుచున్ మీరాకకు ఏండ్లు లెక్కపెట్టుచునుండెద
జలముల తామర పత్రమువలె నలరు రాజ్యమున భరతుండు.

అనిన వేళ కొక్కెడ చరణములరుదెంచక నున్నన్ జూతున్
ఆక్షణమ్మె యీనా దేహము నగ్నియందు నాహుతి చేతున్
చరణధూళి తిలకము దిద్ది చేయుచుంటి శపథమునొండు.

# 27

"నా ప్రార్ధన మొకటే రామా మీ పాదుకలిందు"

ఎంతయో దీనత్వమొప్ప భరతుడడిగిన ఈ దానమును శ్రీరాముడు కాదనలేకపోయెను. శ్రీరామ పాదాబ్జపరాగముతో పావనమైన యా సువర్ణ పాదుకలను భరతుడేనుగుపై నుంచి యూరేగించుచు అయోధ్యకు తీసుకొని పోయెను. ఆ పాదుకలకే యతడు రాజ్యాభిషేకము గావించెను. తాను రాజ్య పాలన చేయనారంభించెను.

ఇట శ్రీరాముడు చిత్రకూడ పర్వతమును విడిచిపెట్టెను. ఇట్లు ప్రయాణ మొనరించుచు వారు దక్షిణదిశకు వెడలిరి. మార్గమధ్యమున విరాధునివధ గావించిరి. శరభంగాశ్రమమునకు చని స్వర్లోకగామియగు నమ్మహాత్ముని దర్శించిరి. ఆ యాశ్రమమునందలి కొందరు ఋషులు శ్రీరామునితో వినమ్రవదనులై మనవిచేయుచు "మహాత్మా ! ఆశ్రమవాసులైన ఋషిసంతతికి రాక్షసులనుండి అనన్వితమగు పీడసంభవించుచున్నది. తాము సమర్థులగు సార్వభౌములు ధార్మికుల రక్షణకు దొరకొనవలెను"

అదివిని సర్వజ్ఞుడైన రాముడు వినయపూర్వక నిశ్చయమొప్ప నిట్లనెను. "తాపసులైన మునిజనులకు శత్రువులగు రాక్షసులను సర్వనాశము చేయవలెననియే నాకోరిక. తామీ విషయములో నిశ్చింతతో నుండదగును" ఇట్లు ఋషిజనములకభయ ప్రదానమొసంగి శ్రీరాముడు వనసంచారము సేయ నారంభించెను. సుతీక్ష్ణాశ్రమము మరియు పంచాప్సర సరోవరము మొదలగు

ప్రాంతములలో పదేండ్లపాటు పరమానందముతో సంచరించిరి. సుతీక్ష్ణుని యాజ్ఞానుసారము వారు అగస్త్యాశ్రమ మార్గముననుసరించిరి. సుతీక్ష్ణుడు మరియు నగస్త్యుడు అను ఋషులిరువురును వీరికి అనేక దివ్యాస్త్రముల నర్పించిరి.

పదిసంవత్సరముల తదుపరి శ్రీరాముడు గోదావరీ తీరమునందుగల పంచవటి యందుచేరెను. అచటవారు నిర్మించిన కుటీరము ఆ మనోహర వనోపప్రదేశము సకలంకారప్రాయమై యందగించెను. ఒకసారి యా పర్ణశాల గద్దెపై రాముడు జానకి లక్ష్మణ సమేతుడై ఇష్టాగోష్ఠి యొనర్చుచుండ ఆ యాశ్రమ ప్రాంగణములోకి ఒక స్త్రీ అద్భుతరూపముతో ప్రవేశించెను. అనురక్తవలె అగవిక్షేపము చేయుచు మదించినకనులతో తానామె శ్రీరాముని యాపాదమస్తము దర్శించ నారంభించెను. ఆమె తన మృదుమధురమంజుల స్వరముతో రామునిగాంచి ఇట్లు సంభాషింప దొడగెను.

## శూర్పణఖ

ఎచటివాడవెవడవు రాజకుమార !
దేహమునర్పించితి శ్యామాకారా !
నన్నిదె స్వీకరింపవేరా ?

నీ రూపమ్మున నృపలక్షణములు
శ్రవణమ్ముల రుద్రాక్షభూషణలు
యోగివందునా పరివారమ్మది
మూగియుండె నీచుట్టు నదేరా ! 1.

వనికే కారణమున వచ్చితివి
ఎకసకెముగ నెందుకు నగుచుంటివి
మాకు సార్వభౌమాధికారమిట
గలదని నీమది తెలియదు మారా ! 2.

రావణ భగినినిరా ! శూర్పణఖన్
యీ యరణ్యమునకే దొరసానిన్
అగణిత రూపములన్నిదాల్చి వని
సంచారమొనర్తు నేనిటేరా. 3.

నీ కొరకై తరుణినిగ మారితిని
షోడశవర్షను సుధాభాషిణిని
నినుగాంచగ నామనసున మారుడు
జాగృతిగొని హుంకరించు రారా ! 4.

నీయరుణాధర లాలసకాంతిని
చేకొని పానము చేయదలచితిని
స్మరుడే నీదగు స్వరూపమీగతి
దాల్చెననుచు మదిదలతు సుకుమారా ! 5.

ఎవడో, దశరథ మహీపతి నెరుగను
అతనిసుతుడు నా యాత్మన్నిండెను
సఖ్యముతో నాస్వామి నీవుగా
సంసారము జేయుదమో శూరా ! 6.

తగదిది నీయర్ధాంగి యగుటకు
పంపుమీ కురూపను దవ్వులకు

నిముసములో నేనీదరి నిలిచిన
ఈ కృశాంగి వధియింతును వీరా ! 7.

అవిరతముగ నాయండనె యుండుము
భజింపుమి యేకపత్నీ వ్రతము
తనుమనములలో నిను కౌగిటగొన
అనుకొను నాళలు అలుగులు బార !

# 28

"ఎవడ వెచటివాడవు రాజకుమారా !"

అని రాముని గాంచి ప్రేమకలాపము లొనర్చు శూర్పణఖను గని శ్రీరాముడు వినోదముగా నిట్టులనెను "నేను ఏకపత్నీ వ్రతుడను. నేను వివాహితుడను. నీ ప్రేమను స్వీకరించజాలను. ఇతడు నా తమ్ముడు. ఇతడొంటరిగా నావెంట వచ్చెను. నీవితని వశపరచుకొనగలవేమొ చూడు."

శూర్పణఖ తన ప్రేమకేళియను పాచికలతో లక్ష్మణుహృదయమును గెల్చుకొనుటకై ప్రయత్నించు చుండెను. లక్ష్మణుడు నవ్వుచు "నేను శ్రీరామ పాదదాసుడను. నీవీ దాసుని భార్యవైన దాసీవై యుండుట లగును. కావున నీవొకపని చేయవలెను. మా యన్నగారినే వరించి యతని చిన్న భార్యవుకమ్ము. ఒకవేళ నిన్నతడు గాఢముగా ప్రేమించిన తన మొదటి భార్యనుగూడ విడిచిపెట్టవచ్చును.

లక్ష్మణుని మాటలలోని పరిహాస మర్థముకాక యామూర్ఖచిత్తయగు రాక్షసి రామునిదరికేగి యిట్లనెను "ఓ రామా ! నీయెదుటనే నేనీస్త్రీని భక్షించి నచో నీ పూర్ణప్రేమమింక నాకే చెందగలదు" అని శూర్పణఖ జానకిని

మ్రింగుటకై ఆమెపైకి పరుగెత్తెను. అప్పుడు రాముడు మహాబలాఢ్యుడు కావున దానికి భయమందక ఈ రాక్షసిని విరూపను గావింపుమని లక్ష్మణున కాజ్ఞాపించెను.

అన్నగారి యాజ్ఞానుసారముగా లక్ష్మణుడు తనఖడ్గమునొరనుండి పెరికి యా రక్కసి ముక్కును జెక్కివైచెను. అపుడా రాక్షసి భయంకరమగు నాక్రోశమొనర్చుచు, వెఱ్ఱిగా కేకలువేయుచు అడవిలో పరుగెత్తుకొనుచు చని తన సోదరులగు ఖరదూషణుల వద్దికరగి తన గోడునంతయు చెప్పుకొనెను. ఇదివిని ఆ రాక్షసులిరువురును రామునితో పోరొనర్చుటకై పరుగెత్తి వచ్చిరి. కాని మహాధనుర్ధరుడైన రాముడు సైన్యసమేతముగా వారిని ముహూర్త కాలములోనే సంహరించెను. ఒక్క రాముడే ఖరుని దూషణుని, త్రిశిరుని, పదునాల్గువేల రాక్షసులతోసహా చంపెను. అదిగాంచి యా శూర్పణఖ లంకకు పరిగెత్తి సోదరుడైన రావణుని లంకాధినేతను సమీపించి అమాత్య. భృత్య సమక్షములో తనవెతనిట్లని తెలిపెను.

## శూర్పణఖ

విరూపయయ్యెను శూర్పణఖయె రఘు
వీరుని యీ దుష్కృతి
కసిదీర్చుకొనుము లంకాపతీ,

ఇదేమి రాజ్యమునేలుట లేమన
ఇదేమి రావణ ఈ జనపాలన
పూరుషసింహము రాముడు దండక
పూర్తిగగెల్చుట గనవు, అయయో సత్తాంధా
లేదింతయు, నీ కర్తవ్యస్మృతి. 1.

ఇరువదికన్నులు తెరచిచూడు నీ
యీ శూర్పణఖా దశ
కంపించును శ్రీరాఘవుని పరాక్రమమున భువి ప్రతిదిశ
వార్తాహరులేతెంచి నీకు నీ
వార్తజెప్పరె కుమతి. 2.

జనస్థానమున క్షోభమురేగెను చచ్చిరి ఖరదూషణుల్
చచ్చిరిపో పదునాల్గువేల రాక్షసులు నీకు భూషణుల్
జనస్థానమున దేవసముదుగా పూజ్యుడయ్యె నాయతి. 3.

నీరాజ్యముననె పూజ్యుడయ్యె తా నీకంటెను నానరుడో
నీవిట మంత్రులతో స్వస్థుడవై నివసింతు నిశాచరుడా
రేపీపాటికి కాల్చివేయు నీ తేజము పీఠద్యుతి. 4.

ఉరమున బాణసుదర్శనాదులను ధరియించెడి సామర్థ్యము
సురమర్దనములు గిరివర్ధనములు చూపుటలవి కడువ్యర్థము
అజేయ ధర్మచ్ఛేదక సేనాపతిదే ఈ యాకృతీ ? 5.

ధనదుగెల్చి పుష్పకవిమానమును తరలించితి వీవేనా
తక్షకనృపసుందరిని వరించి దర్పించితి వీవేనా
మరణభయమ్మేమాత్రములేని దొర వీవేనాక్షితి. 6.

మరల వచించెద నా శ్రీరాముని మాన్యమైన యాకథ
కరమునువిడి చనుబాణమ్మదియొక మెరసెడి విద్యుల్లత
మహిత శస్త్రునై పుణ్యముగాంచిన మంత్రముగ్ధమౌ మతి. 7.

ముద్దిడు శ్యామలమూర్తి వానిగన భువి మన్మథునకు ప్రతి
వానివెంటగల జానకిగన సరివచ్చునెందులో రతి
ఆ యువతికి నీకే సరిపోలునటంచు చెప్పు నామతి. 8.

వడినీకై యాసుందరిగొని రావలెనని మదినెంచితి
తన్నిమిత్తమే వారి కుటీరద్వారమునకు వెడలితి
ముక్కుచెవుల నిటుజెక్కి యెట్టులవమతిజేసెనో కనుగతి. 9.

పొమ్మవేగ పోపొమ్మ సోదర యుగమ్మువధించగ బొమ్మ
నన్నుజూచి యాజనకాత్మజ తానవ్వె నామె గొనిరమ్మ
నావలెనే నీ భూవిభుతను నవమావింత్రు దనుజపతి. 10.

# 29

"కసిదీర్చుకొనుము లంకాపతి."

ఈరీతి పదేపదిగ శూర్పణఖచేత రగుల్చబడిన దశానన దావానలుడైన రావణుడు రాముని యుద్ధమున గెల్చుకొని సీతాపహరణ మొనర్ప ప్రబల యత్నములు చేయసాగెను. తన్నిమిత్తమతడు మారీచుని సహాయమునుగోరెను. మారీచుని కిదివరకే రాముని యవక్ర పరాక్రమము తెలియును. అతడు రావణుని మనస్సును మరల్చుటకై చాల ప్రయత్నించెను. కాని యతని బోధ నిరుపయోగమయ్యెను.

చివరకు వీరైతే ఏదేని ఒక కపటోపాయముబన్ని వంచించవలయునని రావణుడొక యుపాయము నతనికిట్లు చెప్పదొడంగెను. "మారీచా, నీవు కనకరత్నఘటిత మృగమువై సీతాహృదయమును లోభపెట్టుము. అంత రాముడామె కోరికపై మృగాన్వేషణమునకు వనికేగును. అపుడే నేను యతివేషము ధరించి సీతాపహరణమునకు పూనుకొనెదను.

వెంటనే మారీచుడు ధరించిన యభూతపూర్వ మృగరూపమును గాంచిన సీతకు నిజముగానే యత్యంత వ్యామోహము గలిగెను. ఆమె పర్ణశాలలోనికేగి రామునిగాంచి మృగవిషయమునిట్లు వర్ణించి చెప్పదొడంగెను.

సీత

నేపూలు గోయుతరి నిటువో జూచితిగాదా!
కొనియిమ్ము నాకు నాహరిణమయోధ్యానాధా!

కళలీనుచుండె శృంగమ్ములు రత్నద్యుతుల
మృదుమధు సుమపత్రితులు మెరయు స్వర్ణతనుగతుల
ఆవర్ణముగన మోహింపజేసె దృక్త్తతుల
ఇంద్రి చాపమటు పుచ్ఛమెగయు గురుగాధా 1.

అదియెన్నిమార్లు యీ దారి వచ్చిపోయినదొ
పద చిహ్నములన్ స్వర్ణవర్ణమే మెరయునదొ
శృంగాగ్రములన్ రంభావృక్షము నొరయునదొ
ఆ స్వర్ణకాంతి గనుడదుగొ దేవరా! కాంతా! 2.

గ్రీవమును ద్రిప్పుచు బల్ఠీవి నొలక నొయ్యారము
తద్భావ విలక్షణ దృష్టిమత్తతా పూరము
మన్మానసమున మృగతృష్ణా ప్రిబల విచారము
తృణ భూమిదాని గని ముగ్ధనైతి మన్నేతా! 3.

ఇట్లెన్ని యనుచు మృగ లక్షణముల నెంచుదును
అమ్మృగమును బట్టుట శక్యమెటని చెప్పుదును

మన్నిమిత్తమే హరధనువు విరుచు పెరుగుదును
తూణమును గట్టుదును వే జను లక్ష్మణ భ్రాతా ! 4.

కోశాగారమ్మైన నయోధ్య దాచినధనము
త్వచ్చరణాన్వేషణ నిటు వని వచ్చినదనుము
కొనితెమ్మ దాని మనకుటీరమున కిక జనుము
అంతవరకు నన్నిట రక్షించును మీ భ్రాతా 5.

ఆ మృగము సజీవమ్మై కరగతమగునేని
తన్మృగ తనుగత రత్నములు జ్యోతులగుపూని
వనిరాత్రుల వెలుగుల దనుపు నవ్విభూజాని
పురి జను వేళల వెంబడికొని పోదము దాతా ! 6.

చనదీని తోడికోడళ్లత్తలు గాంచెదరు
కైకయు భరతుడు గని మనల నసూయపడెదరు
అంతవరకు నీనిధినే దాచెద గాంచెదరు
ఓ ధనుర్ధరా ! ఆగితిరెందుకు దయలేదా ! 7.

గురి తప్పకుండ నాశరమువైచి చంపండి
నా మరదిగారు తచ్చర్మము నొల్చును సుండి
ఇంద్రుడగును నాపతి భువేణాసనమునసుండి
అదొనగము నెక్కినటు దోచు మృగము శ్రీపాద ! 8.

# 30

"కొనియమ్మ నాకు నా హరిణమయోధ్యానాథా"

సీతాదేవి ఈ హఠమును మాన్పించలేక శ్రీరాముడు ధనుర్బాణము లను గైకొని యాలేడి జాడలో పరుగెత్తెను. ఆ మృగమును గురిచూచి శర ప్రయోగమొనర్చెను. రామబాణ హతుడైన మారీచుడు "హా! సీతా! హా! లక్ష్మణా! త్వరగా పరువెత్తిరండు" అని అచ్చము శ్రీరామచంద్రుని కఠధ్వనియా యనునట్లె అరచెను. అదివిని పర్ణశాలగల సీత యొడలు కంపించెను. శ్రీరామచంద్రునకేదో యాపద వాటిల్లినదని తలంచి లక్ష్మణుని రామాన్వేషణమునకై పంపించెను. ఇక ఆశ్రమములో సీతయొక్కతే మిగిలెను.

ఇది యవకాశముగా భావించి రావణుడు యతివేషము ధరించి సీత యొద్దకరిగెను. కొంతసేపటిలోనే యతడు తన మనోవికారమును ప్రకటించుచు ప్రేమకలాపములు ప్రారంభించెను. అపుడా మహాపతివ్రతా శిరోమణి యైన మైధిలి యతనిని భయకంపితస్వరములోనే యిట్లు హెచ్చరించసాగెను.

సీత

యాచకా! నిలువకు ద్వారము నాని
ఘన నీలిమ రూపొందిన మెరపున కాల్చుకొనకు నీపాణి.

కామ వ్యధయను పురనేవించి
అంగణమున తూలాడకు మించి
జనకసుతా పదనఖ స్పర్శయు నశక్యము కలలోనేని. 1.

నేనిట నొంటరి దానను గాను
రాము దివ్యయశమాకృతులూను
కనబడకుండనె నినుదేహముతో నరకమంపునజ్ఞాని. 2.

శృగాల మటులానగ వేమిటది
రెప్పబడని యా చూపేమిటిది
రామవిగ్రహము దప్పమరేదియు రాదుకనుల దుర్మానీ! 3.

సీతతోడ కాంక్షింతు ప్రేమము
కాలకూట రతి గలదె క్షేమము
హతభాగ్యా! శశి సూర్యుల కరమున నంటజూతు ధృతిబూని 4.

నిర్జనవనిలో నీవునమగవి
హరింప జూచెదవాత్మశక్తిని
వహ్నిజ్వాలల వస్త్రములోనిడికొని పోజూతురెమౌనీ! 5

పాపి! కనులు నికషోపల మనుకొని
బరికత్తుల గొని పదునిడుదేమని
దాననీకు నంధత్వమె కాక ప్రాణాంతకమగు గ్లాని. 6.

అల్పుడ పీవెట అహరియెక్కడ
వాగులెక్కడ వనధియదెక్కడ
హాలాహలమీవా రాఘవుడో సాక్షదమృతప్రాణి. 7.

గరుడుండెక్కడ కాకియదెక్కడ
శ్యాముడు రాముడు సాక్షాదిందుడిద
మర్త్యమనమ్మది మహిగోరినచో చెందగలదె ఇంద్రాణి. 8.

అబలను ననుగని బలమును చూపి
దుర్బల హస్తము దూరము చాపి
రమ్మనుదే శ్రీరామబాణ పటు వజ్రఘాతలిడు హాసీ. 9.

ముందు ముందున కదెందుకు సాగెదు
చరణమ్ములెమును వెనుకకు లాగెదు
చరణమ్ములగల సావధానతయు శిరమునలేదా ఘోణీ ! 10.

పరువిడు పరువిడు పతి రఘువీరా
కమల సుమముగొన కరి వచ్చెనురా
ఎచటనుంటివో ఇచటనుండి నా తుదిమొరవిను చెవిబూని. 11.

# 31

"యాచకా నిలువకు ద్వారమునాని."

సీతయొక్క దీనాలాపముల వినిపించుకొనక రావణుడామెను రెండు చేతుల లేవనెత్తి ఆమెయేడ్పును మరియు నామెయాక్రోశమును సరకుగొనక తన రథమున పడవైచికొని లంకాపురికి బయలుదేరెను.

ఇటులా మాయామారీచ వధమొనర్చి శ్రీరాముడు తిరిగి పర్ణశాలకు వచ్చుచుండగా ఎదురుగా వచ్చుచున్న లక్ష్మణుడు కనబడెను. సీత నొంటరిగా విడిచి వచ్చుచున్న యతనిగని రాముడు వ్యాకులచిత్తుడై "లక్ష్మణా ! జానకి నొంటరిగా విడిచి యేల వచ్చుచుంటివి ? ఆ నీచ మారీచుని యార్తధ్వని నా కంఠధ్వనివలెనే యుండెగావున మోసపోవుకదా ! నా శరాహతినుండి తప్పు కొ్వ నతనితరమగునా ! నీకుతెలియదా ? అనెను. లక్ష్మణుడా మాటలువిని వినయవినతుడై "యన్నా ! ఈ మాటలే నేను జానకీదేవి కెఱింగించి రాము డజేయుడంటిని. కాని యామె నన్నెంతో కఠోరభాషలతో నొవ్వనాడినది. ఆమెకై నేనిట్లు రావలసివచ్చె"నని యనెను. అదివిని రాముడు "వెఱ్ఱివాడా ! ఒకస్త్రీ క్షణికావేశమునకు గురియైయనిన మాటల పాటించితివా ఏమైన నామె నొంటరిగా విడిచివచ్చుట అది మంచిపనికాదు. సత్వరము పర్ణశాలకు నడు

**వుము.** నాయెడమ కన్నదురు చున్నది. శరీరమంతయు కంపించుచున్నది. సీత కుశలముగానే యుండునుకదా'' అని తమ్మునిగొనివచ్చెను.

అటులా యిరువురు సోదరులాశ్రమమునకు వచ్చిరి. పర్ణశాలలో సీత లేదు ఒక కృష్ణాజినము కొన్నిదర్భలు అస్తవ్యస్తముగా నచట పడియున్నవి. శ్రీరాముండంతట సీతా! సీతా! యను కేకలిడుచు వని ప్రతిధ్వనులీన పిలువ దొడగెను.

రాముడు

వని పాద్పడి యాశ్రమము మిగిలెనా
చనియెనెచటికి జనకనన్దనా

కదంబమా త్వరగా వినిపింపవె
నదీతీరమున నాతివిగంటివె
కటిగత కలశము కరకమండలువు
హరిమధ్య. రాజమరాళ గమనా! 1.

శోక నాశక యశోకా చెపుమా?
క్ష్మాజాశుభాంగి జాడతెలుపుమా
పక్షివాళమేటికి పడకు భూజమా
కలలోనీకు నశుభము కలిగెనా! 2.

గౌరాంగి యెచటగలదు పటీరమ
సుదతియుండు నెచ్చోట కుందరమ
ఆనయవతి యెటనలరు రసాలమ
గాలిలేక వడకాడ కొమ్మలన 3.

ఘాత ఘడియ అదిగగ్గెనా చెలి
సీతా, సీతా, చెలీ, మైథిలీ
అనెడి పిలుపు వినలేదె నెచ్చెలీ
వసించి వచ్చితి శిలాసనమున 4.

కాంచుమి లక్ష్మణ కనబడు కనులు
ప్రియవె యమాయిక విశాలాక్షిలు
నలినాక్షివె ఆహరిణ పోతములు
వానికనుల తడియేల లక్ష్మణ 5.

మరుత్తు ఖగములు మౌనము బూను
హరించె నెవడాయంబు జాస్యను
నిలింపుడెవడేని భక్షించెనో
జన్మజన్మముల శత్రుత్వమ్మున 6.

విధియే తిరిగి యిటు విజయము బొందెను.
దెబ్బమీద దెబ్బై యాపదమను
శౌర్యధనము, లప్రభలనిపించెను
తిరిగి పురికి పోవుదమలక్ష్మణా 7.

అనుభవించునది అదియే మున్నది
నాల్గునాళ్ల జీవనము ముగిసినది
దుఃఖ సముద్రిము తుపాను గొన్నది
మునుగనిమ్మ రాముని సాగరమున. 8.

# 32

"చనియెనెచటికి జనకనందనా"

సీతావిరహముచే సంతప్తుడై వ్యాకులపడుచున్న శ్రీరాముడు, ఆకాననమునందు గల తరులతాగుల్మముల పరువెత్తు నదీనదములు ఎదురైన ఖగ మృగ సంతతులగాంచి సీత యేడనున్నదో జూడదెల్పుదురా యని పిచ్చి వానివలె ప్రశ్నించసాగెను. కాని యెవరును సమాధానమీయలేరైరి ఆశ్రమ మృగములు మాత్రము దక్షిణాభిముఖములై నిల్చియుండెను. అదిగని శ్రీరాముడామె దక్షిణదిశకు వెడలియుండవచ్చునని భావించెను. విరహా కులితమానసుడైన రామప్రభువును లక్షణుడు, యథోచిత మృదుపదములతో సాంత్వన పరచుచుండెను. సోదరులిరువురును సీతాన్వేషణ తత్పరులై దక్షిణాభిముఖులై బయలుదేరిరి. శ్రీరాముడు సీతా ! సీతా ! యను మొగులు ముట్టుకేకలతో పిలుచుచు పోవుచుండెను. జడములగు పర్వతముల నైతము సీతజాడ నడుగుచుండెను.

మార్గమధ్యములో వారికి కొన్నిపువ్వులు పడియుండుట కనిపించినది. శ్రీరాముడా పువ్వులివి సీతజెడలోనివేయని గుర్తించెను. వానిని రాముడే స్వయముగా సీతకొప్పులో తురిమెను. ఆపూలు దృష్టిబడినంత రాముని దుఃఖమునకు మేరలేకుండెను. లక్ష్మణుగాంచి యిట్లనెను.

రా ము డు

ఇవాయను జడయందలి పూవులె
అవియులక్ష్మణా ! ఆమెపదములె

రాక్షసాకృతింగల యొకపాదము
ఆపదముల నొనరుచు విచ్ఛేదము
వాయుహతి చెదరు పద్మదళములె 1.



(61)

కచ్చితముగ లక్ష్మణ ఈస్థలిని
దితిజుడెవడో బాధించె మైథిలిని
గెలిచెనా సీత నంగబలముతె 2.

దవ్వు విరిగిపడె ధనువెవ్వరిది
సుమణి రత్నఖచితమయి యున్నది
కలియబడె నెవ్వడెవరితో బలే 3.

ఘనవైడూర్య సు కవచమెవరిదో
మణులు ధూళిలో నణగారినవదో
అసుర నెదిరించెనెవరు కనవలె 4.

దుమ్ముగ్రమ్మ ఛత్రమ్మదె కాంచుము
దండము విరుగుట ధరబడు పెంచుము
ఎవడు పోరలించె సూతునిటువలె 5.

శవమై పడియెను సారథియిట్లు
కరమున తెగిపడె కళ్ళెమదెట్లు
శిశారాంగములు రక్తసిక్తములె 6.

కాంచుము రథపు నొగలు విరిగినవి
చక్రములిరుసులు చెక్కలయినవి
చెదరిపడియున్న విటుల్ బాణములె 7.

శీతదృష్టి వీక్షించుచు నభము
చచ్చికట్టైయెజనె రాసభము
ఇట్టి వాహన మెవరిదో తెలియవలె 8.

అనుమానములో బడెనాలోచన
కొని చనిరెవరిటు జనకనందన
ఆమెకై యుభయులు పోరాడవలె 9.

హృతయొ జితయొ భక్షితయొ మృతయొకొ
సీత యెచట యే స్థితినున్నదొకొ
ఇటి గోప్యమును హృదయమెరుగలే 10.

ఎవరి యొద్దను నెచట నున్నను
జానకిఁ దిరిగి తెమొసంగవలయును
మతిని స్ఫురియించు క్షాత్ర బలములె 11.

అతడమానుషుండమరుడైనను
ఆతనిగాల్చ రోషాగ్ని పొంగును
వడకవలె బలమున త్రిజగమ్ములె. 12.

# 33

"ఇవి ఆయమ జెడలోని పూవులే"

ఈ విధముగా సీత యడుగుజాడలను గుర్తించి, క్షాత్రతేజము పొంగివచ్చిన శ్రీరాముడు సీతాన్వేషణకై ముందునకు సాగెను.

ఒకచో నొక పక్షీంద్రుడు రక్తస్విన్నాంగుడై దుర్భర పరిస్థితిలో నుండి వారికి కనిపించెను. అతడు భూమిమీద నవశుడై పడి కొనప్రాణములతో నుండెను.

ఈ గృధ్రరూపము దాల్చిన రాక్షసుడే సీతను భక్షించియుండునను అనుమానముతో "క్షుర" సంజ్ఞక బాణము నతనికి జూపెట్టెను. అపుడు నెత్తురు నురువులు గ్రక్కుచున్న పక్షిరాజగు జటాయువు శ్రీరాముని గని యిట్లనెను.

మరణోన్ముఖు నన్నిటులేలా మరలి చంపెదవు రఘునాథా
ఖలునడ్డగించి కూలితిని రావణుకరమునబడె నీసీతా.

ఎపుడేదో యాత్త్రిని సేవింటి, నీవినా సీత నేగంటి
మరదియును లేడు తన నంటిబలము పుంజుకొని యెగిరితిని
రథపథ మడ్డగించితిని నేతా! 1.

కామిన్నృశంసుడు రావణుడు
సీతనేలగొని చనువాడూ
ఇదియంత తెలిసికొని యపుడు
కేల్గోరికి, దేహమునుబరికి, శిరమార్చికొట్టితిని దాతా! 2.

రాముసతిని రక్షించుటకై, వడి పోరాడితినపుడేనై
కవచముకుటముల విరిచితికై బాణము గొనసీయగలేదు
తూణమంతనీయను చేత. 3.

సర్వాంగక్షతి జేసితిని, పక్షవజ్రహతి వేసితిని
నిశ్శంక ద్వంద్వమాడితిని, సారధిని పడంగూల్చితిని
ఖరప్రహారణములు దినె, రోత. 4.

దేవిని దూరమ్మొనరించి ఇరుసును భగ్నముగావించి
గీరల ముక్కలుగా చించి ఒకగాడిద తొట్రిల పడెను
వేరొక్కటి యమ్మెను ప్రేత. 5.

నేలపై బొరలె ఛత్రమ్ము గాంచె పరాకాష్టదురమ్ము
పుత్రుకు పోరాడితి నమ్ము, పౌలస్తుడు పండ్లుగొరుకుచు
కత్తినిగొని పై బడె త్రాతా ! 6.

రెక్కలు ఛేదించినవెన్క నేలగూలితి నేనింక
సతివడకి కాంచె నావంక, కొనిపోయెనామె నొకచంక
కొట్టుకొనుచుండె మది ధాత. 7.

ప్రాణాలుమిగిలె నేత్రాల, నేగంటి వాని గుణశీల
వాడేగెను గగనపథాల, ఇక నీ ముద్దులదొరసాని
చనుచు నేడ్చుచుండెను సీతా. 8.

# 34

"రావణుని కరమునబడె నీ సీతా."

ఇట్లు నిస్పందేహముగా చెప్పి పక్షిరాజగు జటాయువు తన దేహమును నేలపై విడిచెను. ఉపకారియైన యతని మృతదేహమునకు అంత్యక్రియల నతిశ్రద్ధతో గావించి రామలక్ష్మణులు ముందుకుజనిరి. పిదప కబంధుడను రాక్షసుని కలిసికొనిరి. తలలేని యా రాక్షసుడు మహాతేజస్వియైన దను పుత్రుడు. రామ లక్ష్మణుల నతడు గుర్తించి శ్రీరామునితో నిట్లనెను. "రాముడు లక్ష్మణునిగూడి యడవికి వచ్చినపుడు నీచేతులు నరికివేయును. నీవపుడు స్వర్గమునకేగెదవు" అని ఇంద్రుడు నాతో చెప్పెను. ఓ రామా ! నీవు నన్ను చంపి కాల్చివేయుము." రావణుడు గొనిపోయిన నాసీతవృత్తాంత మాద్యంతము మొదలు నాకెరిగింపుమ"ని రాముడు పలికెను.

"నా దేహము దహనమొనర్పుము, పిదప దాని నెరింగింతును" అని కబంధుడనెను. చిట్టచివరకు రామలక్ష్మణులు కబంధువును బొందలోబడవైచి

యతని చితకు నిప్పంటించి కాల్చిరి. దహనసంస్కారము జరిగినపిదప ధూమరహితమగు నగ్నివలె వాడు తేజస్వియై తిరిగిపుట్టి వెలికివచ్చెను. "కిష్కింధాపతియైన సుగ్రీవునితో స్నేహమొనర్పుము. అతడు నీ పత్నిని అన్వేషించుటలో నీకు చక్కని సహాయ మొనర్పగలడని" వచించి వారికి ముంగలిమార్గము చూపించెను.

పంపాసరోవరముయొక్క పడమటితీరమును చేరినతరువాత శ్రీరాముడు శబరియాశ్రమమునకు చేరెను. ఆ వృద్ధతపస్విని వర్ణనాతీతమైన ఆదరానురాగములతో నతనిగాంచి యుత్సాహాతిశయమున నిట్లనెను.

శ బ రి

ధన్యనునే శబరిని శ్రీరామా
పాదముంచితివి ఆశ్రమసీమ.

శ్రీపదముంచితి చిత్రకూటగిరి
మునివరులెందరొ ముక్తతబొందిరి
క్షణమాగి వృతపునీడ ప్రభూ
అమాయకను నను క్షమించుకొనుమా. 1.

పూతచరణముల పూజనుగోరె
కన్నులగంగలు కాల్వలుబారె
పదప్రక్షాళన జేసెదస్వామీ
ప్రభువులు మరతురు ప్రియాణాశ్రమ. 2.

విబుధుల చందన విలేపనార్థము
గురుసేవనలో నరిగె జీవితము

పులకల పూలుగ నర్పించితిరా
మునిసేవలనెండెను తనువృక్షము. 3.

వెలిగించితి-విజ్ఞానజ్యోతి
ఆత్మనివేద్య సమర్చా ప్రీతి
అనంతుడేనాముసు నీలిమలను
పులిమినిలిచె గుణధామా! 4.

ఏమి నివేదనమిత్తును స్వామీ
గురుప్రసాదమని కొనుసదియేమి
చకోరపక్షిని సమీపించెను
ఆకలిగొని పూర్ణిమా. 5.

కలవు సేవలో కందమూలములు
పరగు మధురములు బదరీఫలములు
ఇంతకంటె వేరేమర్పించును
వనలత! కల్పద్రుమ! 6.

ఖగదంశనములు కావీక్షతములు
చవిచూచితినే స్వయమీ ఫలములు
మధురఫలంబులె మాతగనిచ్చితి
చూడను ఫలర క్తిమా! 7.

ఇటు శంకించెదవేలా లక్ష్మణ
కావెంగిలివివి కనెనఖిమంత్రణ
ఈ వదనములో నెపుడునదించును
వేదమ్ముల మధురిమ. 8.

# 35

"ధన్యనునే శబరిని"

ఈ రీతిగా శబరి యానందగానము చేయుచునే యనంతములో లీనమై పోయినది. ఆ వెనుక శ్రీరాముడు లక్ష్మణునిగూడి ఋష్యమూక పర్వతము పైకి విచ్చేసెను. ఈ పర్వతరాజము పైననే రాజ్యభ్రష్టుడైన కపిశ్రేష్ఠుడు సుగ్రీవుడు తాను ఆంజనేయుడాదిగాగల యమాత్యులతోగూడి యజ్ఞాతవాస మొనరించుచుండెను.

సుగ్రీవునియన్నయగు వాలి యతని కిష్కింధనుండి యవలకు వెడల గొట్టెను. సుగ్రీవుని పత్నియగు "రుమ"ను గూడనా పాపాత్ముడతని సన్నిధినుండి బలవంతముగా హరించి కొనిపోయెను. ఆ సుగ్రీవుడీ ధనుర్ధరు లగు రామలక్ష్మణులను గాంచి వీరిని వాలియే తనపైకి పంపియుండవచ్చునని తలంచి భయపడి మలయపర్వతమున తాను తలదాచుకొని యాంజనేయుని మాత్రము వారి యథార్థవృత్తాంతము తెలిసికొనిరమ్మని పంపెను.

సచివోత్తముడు హనుమంతుడు శ్రీరాముని సవినయముగా కలిసి కొనెను. ఆ మొదటి కలయికలోనే రామాంజనేయుల మధ్య అత్యంత స్నేహానుబంధ మేర్పడెను. హనుమంతుడు శ్రీరామ సుగ్రీవుల సఖ్యతకై యొక సమావేశ మేర్పరచెను. ఇరువురు తమతమకష్టముల సమయోచితముగా ప్రసంగించుకొనిరి. ఆంజనేయస్వామి అగ్ని రగిల్చెను, అగ్నిసమక్షములో శ్రీరామునితో సుగ్రీవుడిట్లనెను.

సు గ్రీ వు డు

సాక్షిగనుండెను పృథ్వి, యాకాశ మగ్నిజ్వాలా
సన్మిత్రుడయ్యె రాముడు సుగ్రీవునకీ వేళ.

వనవాస మనుభవించుచు నుంటిని నేనును రామా
ఆద్యంతము విన్నావియ్యది హనుమతోడ శ్యామా
దుఃఖితుడే దుఃఖితునకు వెతనుపకరించు చాలా. 1.

అగ్రజుడే అరియయ్యెను ఏమనుచు దెల్పనార్యా
ఆత్మీయసతిని వాడే హరియించె దుష్టచర్య
రహి వాలి వధమొనర్చి రౌరవము పంపవేలా. 2.

రాహుంబాహుంగతని స్తేజోరవి విధమ్మనుంటి
గతరాజ్య ప్రాప్తియెయగుచో నతిశక్తుడ ననుచుంటి
స్వీయశౌర్యమును స్వముఖానన్ జెప్పుటెటు నృపాలా. 3.

మామకీన వానరసైన్యము మరలదెచ్చెదేని
ఖల రావణవైరిగ నిల్చున్ కపులులక్ష హాని
వనధి దాటుదురు గిరి ద్రవ్వుత్తురు వానరులవలీల. 4.

నిశ్శంకన్ సీతాన్వేషణ నెరపగలరు వారు
ప్లవంగవిష్ఠను కన్నులతో పరికింతురు మీరు
సర్వస్వమునర్పించును కపిసైన్యము గురుశీలా ! 5.

చేయి చేతనుంచెద మీతో చెలిమిగలిగె స్వామీ
సరకుసేతునే శత్రువు భీకరుడున్నైననేమి
క్షితిపాలా వాలినిజంపన్ సిద్ధపడవదేలా. 6.

ఘనశ్యామ నేనీమహినే గాలించెద చూడు
చివరకు సీతను రాముని దరిజేర్పగలడు వీడు
అడ్డమ్మగువాని నంపెదను అమర భూస్థలాల. 7.

హనుమ నీల మీరలమాత్యులు నాలకించుడీరోజు
ఈ మహికిన్ నేనొకమంత్రినె రామప్రభువె మనరాజు
రామాజ్ఞాపాలనమే మన ప్రామాణ్యపువేల. 8.

# 36

"సన్మిత్రుడయ్యె రాముడు సుగ్రీవున కీవేళ"

అగ్నిసాక్షిగా సుగ్రీవుడిట్లు ప్రకటించిన మీదట శ్రీరాముడు కూడ సుగ్రీవునకు సహాయ మొనర్పగలనని మాటయిచ్చెను. సుగ్రీవుడు వాలిని యుద్ధమునకాహ్వానించెను. వాలిసుగ్రీవుల మధ్య భీకరమగు ద్వంద్వయుద్ధము జరిగెను. సుగ్రీవుడోడిపోవుచుండుట గుర్తెరింగి సమయమునకు శ్రీరాముడు చెట్టుమాటుననుండి వాలిపైనొక బాణమును విడిచెను. ఆ బాణముతో మృత ప్రాయుడై వాలి నేలగూలెను.

ఆ బాణముతో తనకు చావు సమీపించుచున్నదని తెలిసికొని వాలి శ్రీరామునిగాంచి "రామా! నేను మీకు ప్రతిద్వంద్వినై లేనపుడు చెట్టుమాటు నుండి గురిపెట్టి బాణమును వదలి నా వధమొనర్చి మీరెట్టి పురుషార్థమును సాధించితిరి.

ఆ మాటవిని శ్రీరామచంద్రప్రభువు తానిట్లనెను.

శ్రీ రా ము డు

నే ధర్మముపాలించితి ననుము
కాదు, వాలివధ, ఖలనిర్దలనము.

అఖిలధరణి భరతుడు శాసించున్
అతడె నీతి, న్యాయము, గ్రహియించున్

భ్రాత నంతె, నే భరతునికెంచన్
"యధారాజా తథాప్రజా" జనము. 1.

తనయుడు, శిష్యుడు, కనిష్ఠభ్రాతా
తనరుచుంద్రు ధర్మముగ పుత్రత
అనుజకాంతనే హరించి నీచత
చాచితిమది తుచ్ఛప్రలోభనము. 2.

రూపొందిన మదరూపుడ వీవు
తగినశిక్ష నీకగు నీచావు
విషయాంధుల తుదిగతి యానోవు
మృగయు చేతిలోనగు పశుమరణము. 3.

నీకై ప్రాణము నిడుదు ననుచు ధృతి
వని సుగ్రీవికు వచనమొసంగితి
అనుజుని కొరకై యన్నను చంపితి
నే పాలించితి ఇచ్చిన వచనము 4.

వేటనాడు జనవిభుడు వనమ్మున
దాగియేయు నస్త్రము పశువధమున
తత్రీక్రీడారతి తప్పులేదు కన
మృగముల శాఖా మృగమతి క్రూరము 5.

అంత్య ఘడియ నీకగు మోక్షప్రద
జాలి నంగదుని సంరక్షించెద
ఈ నీ రాజ్యము ఈ కిష్కింద
భావింపగ సుగ్రీవార్పణము 6.

## 37

### "కాదు వాలివధ ఖలనిర్దలనము"

శ్రీరాముడు వాలిని వధించెను. సుగ్రీవునకు తిరిగి కిష్కింధారాజ్య ప్రాప్తియయ్యెను. రుమాసుగ్రీవుల మధుర మేలనము సంభవించెను. రాజ విలాసములలో రమించు సుగ్రీవునకు రామకార్యముపట్ల విస్మృతి ఘటించెను. లక్ష్మణుడు క్రోధావేశముతో నతనికి కర్తవ్యస్మృతి గలిగించినపుడు గభాలున కనువిప్పయ్యెను. సుగ్రీవుడు వానర గణముల కాహ్వానములంపి పిలిపించెను. శ్రీరాముడు వీరశిరోమణియగు హనుమ చేతికి తన యంగుళీయకము నొసంగెను. సీతాన్వేషణకై యతడే ఏకైక సమర్థుడని రాఘవుల యభిప్రాయము.

వానరసైన్యము లష్టదిశలకు సీతాన్వేషణ దీక్షతో కదలిపోయినవి. దక్షిణదిశాభిముఖులై చనినవారిలో హనుమదంగదనలజాంబవదాది ప్రముఖ వీరులుండిరి. ఎవరెంత యన్వేషించినను సీతజాడ లభింపదయ్యెను. అపుడా కపిశ్రేష్ఠులు హతాశులైరి. సుగ్రీవుడొసంగిన నెలరోజుల గడువు పూర్తి యయ్యెను, వీరందరాశలు విడుచుకొని పర్వతముపై హనుమను పరివేష్టించి యుండిరి.

అపుడు 'సంపాతి' యను గృధ్రరాజు వారియొద్దకేతెంచెను అతడు జటాయువునకు సోదరుడు. అట్లే దశరథునకు ప్రియమిత్రుడు. "నాకు 'చక్షుమతి' యను విద్యవచ్చుటచే సీతారావణుల నేనిచ్చటినుండియే చూడ గల్గుచున్నాను. సీత యిపుడు స్వర్ణద్వీపమగు లంకలో రావణాంతఃపురములో బంధింపబడి యున్నది. అగాధమగు ఈ క్షారసముద్రమును దాటగల యుపాయమేదైన నాలోచించినచో ప్రయోజనకరమగును" అని సంపాతి సానుభూతి పూర్వకముగా పలికెను.

అంగదాది వానరులతని మాటకు సంతసించి సముద్రలంఘనమున కెవరు సమర్థులని పరిపరివిధముల నాలోచింపదొడగిరి. చివరకు అనుభవశాలి యగు జాంబవంతుడొక నిశ్చయమునకు వచ్చి యిట్లు పలికెను.

# జాంబవంతుడు

జలనిధి దాటగ శక్తుండెవడు
అంజనేయునకె అది సాధ్యపడు.

సర్పములన్నిజ చరణయుగళిగొని
త్వరనొక దూకున దాటును జలధిని
గరుడు కరణి రెక్కల నెగయు దివిని
గరుడి కన్న బలవంతుడు 1.

అంజని సుతుడీయన యతిబలుడు
ఇతడనిలునకును సుత డంశజుడు
బలహతి దిగ్గజముల గూల్చునితడు
బలవంతుడు ధీమంతుడు 2.

ఇనోదయమ్మున నితడుదయించెను
త్రిశత యోజనాల్ దివిని గమించెను.
ఇనబింబము ఫలమని భావించెను
అదిగొన జనె హనుమంతుడు 3.

పట్టబోయె నాబాలుడు రవిని
కంపించె త్రిలోకములు నదిగని
జేనఁడున్న యా చిరుత కొరకని
వజ్ర మూనె తానింద్రుడు 4.

దేవేంద్రుని యా దివ్యాయుధ హతి
అకట నుంత గాయపడె మారుతి

వాయుపూనె ననివార్య కోపమతి
స్తంభనమొనర్చె గతినతడు 5.

అనిలు డాగ నాగెను జీవనగతి
పవనుని సాంత్వన పరచెను సురతతి
వరమొసంగి యావాయువు సంతతి
నాదరించె భగవానుడు 6.

అనినే శస్త్రము నినుభేదించదు
వరగతి నిచ్ఛామరణము నొందెదు
రవికి నవీక్ష్యచ్ఛవి తో వెలసెదు
అని వరమొందిన చిరజీవుడు 7.

హనుమా కొనుమా ఆత్మనిశ్చయము
నీసరిగాదీ విఖిల కపిగణము
వామను వలె నీ పదమును లేపుము
కలుగు జయమ్మొక గంతిడు 8.

# 38

"అంజనేయునకె యది సాధ్యపడు"

జాంబవంతుడు హనుమంతుని యనన్య సామాన్యమగు సామర్థ్యమును ప్రస్తుతించినంత హనుమ బాహువులు ఉప్పొంగి పోయినవి. చూచుచుండగనే యతడు ప్రచండరూపము ధరించెను. వానరులెల్ల హర్షపరవశులై హనుమ ననేకవిధముల ప్రశంసించిరి.

వెంటనే వాయుసూనుడాంజనేయుడు మహేంద్రగిరి శిఖరారూఢు డయ్యెను. స్వాంతమందు లంకను స్మరించి ఆకాశవీధిలో నెగసెను. ఆయన రెప్పపాటులో త్రికూటాద్రి చేరెను. మహేంద్రుని రాజధాని యనదనరు లంకా నగరమునాయన దూరమునుండియే తిలకించెను. సకల సంపదన్వితమైన యా నగరిని రక్షించుటకు ఆసహాయ శూరులైన యసురవీరులు సిద్ధముగానుండిరి. ఆ నగరిలో ప్రవేశించుటకు కష్టసాధ్యమైయుండెను. హనుమ సూక్ష్మశరీర ధారియై యర్ధరాత్రి యాపట్టణమంతయు గాలించిచూచెను. రావణాంతఃపుర ములో గూడ సీత జాడగానరాదాయెను. నిరాశచెంది యశోకవనప్రాకారో పరితలంబున నాసీనుడై చింతించెను. సుందరమగు నావనము గాంచెను. అచటినుండి యెగసి ఒక శింశుపావృక్షముపై కెగసి దానిపై నాసీనుడై చూచు చుండెను. ఆపుడతనికచ్చట రాక్షసస్త్రీ పరివృతయై మలినవసనధారిణియైన సీత దృష్టిలో బడెను. హనుమ సీతనింతకు ముందెప్పుడును చూచి యెరుగడు. తప్పక ఈమెయే సీతయైయుండునని యా వీరశ్రేష్ఠు డంతరంగములో నొక నిశ్చయమునకు వచ్చెను. మరియు నామెను గాంచి యిట్లనెను.

హనుమంతుడు

ఈయమయే రాము దొరసాని.

చంద్రునివీడిన సతియౌరోహిణి
తప్పులలో నొప్పెడు హరిణి
శ్యేనపు తొరటం జిక్కిన పక్షిణి
హిమగతి స్తంభించిన సురవాహిని 1

అతికృశమలినయునయ్యొ సులేఖ
అది ధూమగ్రసి తాగ్ని శలాక

చటుల శిశిరగత చంపక శాఖ
కనబడు వ్రత ధారిణియగు యోగిని 2.

కలచునేడ్పుచే కనులు గుర్రిడ్డిపడె
చెక్కుల బాష్పపు చారికలేర్పడె
కలచు అనిద్రన్ కన్నులెఱ్ఱవడె
పతిచింతా సంభరిత విరహిణీ 3.

కనబడు పంక మలిన యగు పద్మజ
కచ్చితముగ నీ కాంతయె భూమిజ
దారుణ విధిహత తా లతాభుజ
వంచన బొందెను వనినీ మానిని 4.

స్వర్ణవర్ణయెటు శ్యామల మలిన
సాధ్వి నమ్రముఖి శశాంకవదన
గ్రహణకాలము సంగ్రస్త దిగ్గలన
ఆశనుమరచి హతాశ నుండె వని 5.

సందిగ్ధార్థవిచార స్మృతియా
అన్యాయార్జితమగు ధన తతియా
చిన్మూర్తి గొనని చిత్రాకృతియా
పరాజిత, యశోభామినియా ? వని 6.

కాకుత్స వర్ణితాకృతి ముద్ర
బాహు భూషణ పరివాళ ముద్రా
నిశ్చయముగ నవనిజ యీ సుభద్రి
జానకి యీమెయె జనకనందన 7.

యివియె కుండలము లివియె వలయములు
ఋష్యమూకగిరి శిఖర పతి తములు
శ్రీరఘుపతికివి చిర పరిచితములు
అమృత ఘడియవచ్చె యశోదాయిని. 8.

# 39

"ఈయమయే రాముని దొరసాని"

ఇట్లీ యమయే జానకియని నిశ్చయముగా తెలిసికొనియు నాంజనేయుడు అకస్మాత్తుగా సీత ఎదుటకు పోవుటకై సాహసించలేదు. అతడా యమ నితఃపూర్వమెన్నడును చూచియెరుగడయ్యెను. శ్రీరామ సుగ్రీవ సఖ్య వృత్తాంతము గూడ సీత యెరుగదయ్యెను తననుగూడ మాయావేషధారియగు రావణుడే యితడని యనుమానింపవచ్చును. హృదయము విప్పి భాషించుటకు సంకోచింపవచ్చును.

ఇట్లీ యాలోచనాపరంపరలో మగ్నుడై మారుతి యుండగా నదే సమయములో పరిచారికాబృందపరివృతుడై లంకాపతియగు రావణుడచటికి వచ్చెను. భీత హరిణేక్షణయగు సీతను బెదరించసాగెను. ఆమెయు చీదరించుకొను చిలుకజేని దొరసానివలె బుసకొట్టుచు నసురాధిపతికిట్లు సమాధానమొసంగెను.

సీత

ఈవిధి బొంకాడకుమీ రావణా నిశాచరా
రామకీర్తిమూర్తి యని సురాసురులకు తెలియురా

వందనీయ శీలముగల వనితను నే పతివ్రతను
పుణ్యముండు రాక్షస నను బొందించు విముక్తతను
నిలుపుము నారీమానము నిజమగు వీరుడవురా 1.

భూపుడు పాపమొనర్చును నీ పృథ్వియె సహియించును
జగముపైన నామమాత్రముగ రాష్ట్రము దీపించును
నిప్పునేల నంటింతువు నీ పురికిని ముష్కరా ! 2.

ఎందెందును లోకనాథుడే కనబడు నారాముడు
పడుకొను తరి రామవామపాణియె తలగడ గనబడు
అనయమ్మాధనుర్ధారి ననుకొని పూజింతురా 3.

అతనికే నే యోగ్యనగుదు నన్యస్త్రీలెవరుగారు
ప్రాణప్రియునొద్దకు ననుబంపుమి సాధువు తీరు
శరణాగతునకు హరి యాశ్రియమిడి రక్షించురా ! 4.

జీవితమును సార్థముగా జేయుమి హరి చెలిమిగాంచు
నిత్యశుద్ధయగు జానకినే రామున కర్పించు
కాకున్నను మృత్యువు నీకడకు నురికివచ్చురా 5.

సురపతి వజ్రాఘాతము గురిదప్పిన దప్పవచ్చు
రామబాణవృష్టి భీకరప్రళయమ్ము దొకచిచ్చు
ఆ రాముడె యలిగిన క్షణమాయువు లేదనుకొనురా 6.

ఆ రాముడు యుద్ధకాముడగుచు ముందువచ్చి నిలుచు
సమర్థుడగు రాముడు నిను సపరివారముగ చీలుచు
కామాంధా ! ఓయధమా ! కాస్తవిచారించురా ! 7.

నీవక్షము నందు గందు నేను రామ బాణమును
వంశపంఖముల వెలుంగు వాని నామ చిహ్నమును
వసుంధరయునింక ముందు భారముక్త యగునురా ! 8.

# 40

"ఈ విధంబొంకాడకుమీ రావణా నిశాచరా"

సాధ్వీ శిరోమణియగు జానకి సంతప్త స్వాంతయై యిట్లు సంభాషించినంత కఠోరచిత్తుడు రావణుడునైతము క్షణకాలము బెదరినవానివలె గనవడెను. జనస్థానమందలి రామలక్ష్మణుల నిరుపమానమైన పరాక్రమమతనికి తెలియునుగదా !

అంతరావణుడు, సీత తన వశవర్తినియగుటకు నొకమాసము గడువొసంగి యశోకవని వీడి వెడలెను. శింశుపావృక్షము నందున్న హనుమంతునకీమెయే జానకియని ధృవపడెను. విశ్వాస మేర్పడెను. ఆమెను చుట్టియున్న రాక్షసస్త్రీలు నిదురించు సమయముగని సుధారస తుల్యమగు రామగుణ గానము మధుర స్వరమున బాడదొడగెను. ఆ గానమాధురి కాశ్చర్యపడుచు సీతాదేవి తరూపరిగాంచెను. ఒక చిన్న కొమ్మనుండి సీతమ్మకు దగ్గరగా వంగి రాముని యానవాలగు ముద్రికను ఆమెచేతిలోన బడవైచెను. అదిగాంచి సీత యపరిమితానంద సముపేతయై ఈ హనుమంతుడు వాస్తవముగా రాజదూతయేయని నమ్మి యీరీతి బలుక దొడంగెను.

సీత

ముద్రిక యిది రామునిదే నేగుర్తించితిని
దూతా ! రాముని స్థితి నుడువుము వినవెంచితిని.

అక్షయ తూణము మూపున హస్తమ్మున విల్లు
విరహములో రాముడు నాకై ఎటు దురపిల్లు
వెతకనుల చుట్టు నలుపొప్పునె వలయము కరణి. 1.

చేతులను ముడిచి కర్మయనుచు కూర్చొన్నారా!
దుఃఖమున నైజ ధర్మమును మరచియున్నారా!
రాచకార్యముల జేయుదురె యిపుడు నొకసరణి! 2.

నేటికిని వారుధైర్యమును విడువలేదుకదా!
ఆ వీరుడు తాశౌర్యమునె మరువలేదుగదా!
సాయమునకు సన్మిత్రుల సేనలు నుండునని. 3.

రాజులు రఘువర జయమును కాంక్షించుచులేరా?
రాముడు జనప్రీతిని గోల్పోయెనె కపివీరా!
ప్రభువు ప్రయత్నమ్ముల ఘనత మరచిరెందుకని 4.

నాస్వామి సీత నే మరచిపోయెనా యేమి?
పెరకొంపల నిజసతి యేద్వజూచునేస్వామి?
ఈ సీతాస్మృతి వారిని గలచునె పావని 5.

నానాథుడు స్వయముగ నాచెర విడిపించునొకో
చతురంగ బలమ్ములు భరతుడు పంపించు నొకో
కోసలపురి వార్తలు రామునికందునె! వని 6.

ఆపదవేళ వారి మోహమావరించినదా!
సీత పయిప్రేమ మదిమాసి పోవలేదు గదా?
వైదేహి చెరను విడిపించునెపుడు భూజాని! 7.

ఆ స్వర్ణఘడియనే కనుల జూడ నోచితినా?
నృపుళంము రావణుని ఎడద దూసికొని చనునా!
పతి పాదము లెపుడీ దారిదొ్రక్కు సద్గుణీ! 8.

నాపతి కుశలము నెంతవరకు వినగల్గుదునో
నే ప్రాణముతో నంతవరకు మనగల్గుదును
నా జన్మలోన జూడ నోచితినొ వారిని.

# 41

"దూతా రాముని స్థితినుడువుము విననెంచితిని"

సీత యడిగిన ప్రశ్నకు దూతయగు హనుమ సరియగు సమాధాన మొసంగెను. నీ బంధవిముక్తి గావింప శ్రీరాముడు తప్పనిసరిగా రాగలడని నమ్మజెప్పెను. హనుమ తన వద్దనుండి వచ్చినట్లు తననాధునకు నమ్మకము గల్గుటకై మణినొకటి యతనికిచ్చి రామునకిమ్మనెను. "తల్లీ! నా భుజము లపై నధిరోహింపుము నిన్నిటనుండి రాముని సన్నిధికి గొనిచను బలము నీదయవలన నాకు గల" దనెను. హనుమంతుని గని సీత "పరపురుషుని బాహువులపై" కూర్చొనిపోవుట గూడనిది. సామర్థ్యము ప్రకటపడగా రాముడే నన్నిటనుండి రావణుని చెండి కొనిపోవు టుచిత" మనిచెప్పెను. వివేకవంతుడును ధర్మస్వాంతుడునునగు హనుమంతుడామె పలుకులలో విలువ గుర్తెరుంగ గలిగెను. వచ్చినపని పూర్తియగుటచే సీతయాజ్ఞగొని హనుమం

కడు బయలుదేరెను. చనుచు చనుచు దనుజుల బలము పరీక్షించు కోర్కి
జనించెను. దానికై వారిని రెచ్చగొట్టుటకుగాన శోకవనమునంతయు ధ్వంస
మొనర్పసాగెను. దాని వారించుటకై వచ్చిన జంబుమాలిని రావ
ణుని సుతుడగు అక్షకుమారుని చంపివేసెను. లంకకు యిలువేల్పులైన దేవ
తల నెల్లర నాశమొనర్చెను. అపుడు రావణుని పెద్దకుమారుడగు ఇంద్రజిత్తు
అతని బ్రహ్మాస్త్రమున బంధితుని జేసి రావణుని ముందుకు కొనిచనెను.
రావణుడితనిని చంపివేయుడని భటుల కాజ్ఞాపించెను. ఇంగితజ్ఞుడైన విభీష
ణుడు వారించెను. రాజదూత వధార్హుడు కాడని వాదించెను. ఆగ్రహించెను,
వినయవినతుడై విన్నవించుకొనెను. చివరకా రావణుని యాజ్ఞానుసారము
ఆంజనేయుని వాలమునకు వస్త్రములజుట్టి రాజభటులు నిప్పంటించిరి. రాక్షస
స్త్రీలు ఈ సంగతి కొనిపోయి సీతకు జెప్పిరి. అపుడు సీత తాను అగ్నిని
ప్రార్థించి హనుమంతునికి కాలకుండునట్లు వరమిమ్మనెను.

## సీత

లీలగాను దివిలో నెగిరి
కాల్చెను మారుతి దనుజపురి.

ఘననగాకృతింగనబడు మారుతి
విద్యుల్లతయై వెనుపుచ్ఛద్యుతి
పురి నిప్పుల గురిపించు క్రోధాహతి
జంఝూనిల గర్జలనడరి 1.

ఈ శిఖరము నుండా గేహముపై
కపి యెరుగును కేళీకందుకమై
తోరణ వాలము జొచ్చి భయదమై
అరిగెడి నటించుచు నగరి 2.

కాలెను గృహములు కూలెగోపురాల్
చిటచట ధ్వనులను చిల్లెను ద్వారాల్
అంతఃపురముల నార్పులు నేడ్పుల్
మునిగె వస్తుతతి యనల ఝరి 3.

ఘన గృహ పంక్తులు కాలెను కూలెను
ప్రాసాదమ్ముల భస్మము రాలెను
క్షితిగల గృహములు చితగామారెను
రాక్షసు లాక్రందన లిడిరి. 4.

ఘన నిద్రస్థితి కాలిరి కొందరు
పథముల మండుచు పర్విరి కొందరు
మాటల భయహతి మరచిరి కొందరు
పరిచయములె, లయమొందె పురి 5.

పిల్లలవిడిచియె తల్లి పరువుగొనె
తన బంధువులనె జనత మరపుగొనె
నిలిచిన దెల్లయు నిలపై బడి చనె
అదొక హఠాత్కల్పాంతకరి 6.

కత్తులు ఢాళ్ళను కరిగెను పూర్తిగ
వీరవృత్తి దహియించె సమూర్తిగ
జ్వాలల గలసెను జ్వాలలు నార్తిగ
సఘనత భస్మతగొనె కమరి. 7.

జంఝులు జ్వాలలు జ్వాలలు జంఝులు
లేదు నివారణ లేవాశ్రయములు
కాపరులంగొని కాలెను వాడలు
అనలమూర్తి నర్తించెపురి.

# 42

"కాల్చెనుమారుతి దనుజపురి."

లంకానగరమునంతటిని దగ్ధమొనర్చి శ్రీఆంజనేయుడు తన వాలాంచలమును సముద్రములో ముంచి అగ్నిని శాంతింపజేసి ఆకాశమార్గమున శ్రీరాముని చెంతకు చేరుకొనెను. సీతయిచ్చిన మణిని ఆంజనేయుడొసంగినంత శ్రీరాముడు దానిగుర్తించి యానందాతిశయమున మారుతిని గాఢాలింగనమొనర్చికొనెను

వెంటనే యసంఖ్యాకములగు వానరసైన్యంబులు తోడురాగ రామలక్ష్మణులు దక్షిణదిశకు బయలుదేరిపోయి సముద్రతీరమును చేరుకొనిరి. శ్రీరామునకు సముద్రమును దాటుటలొక చిక్కు సమస్యగా నేర్పడెను. మూడురోజులు ప్రాయోపవేశ దీక్షబూని సముద్రుని ప్రార్థించెను. కాని లాభము లేదయ్యెను. చేయునదిలేక శ్రీరాముడు సముద్రునిపై తన యమోఘ శరమును గురిచేసెను, అంతనా రత్నాకరుడు అంతరంగములో బెదురొంది వెంటనే మానవాకృతి ధరించి రామునికి నమస్కరించి సవినయముగా నిట్లు వచించెను. "రామచంద్రా! మీ సైన్యములో నలుడను వానరుడు గలడు. అతడు విశ్వకర్మ కుమారుడు. అతనిచే సేతువు నిర్మింపజేసి తరించుడి. మీచే కట్టబడిన వంతెనను నే సంతసమున నా యురమున ధరింతుననెను. శ్రీరాముడు నలున కాజ్ఞాపించగా వానరులందరును ఉచ్చైస్వనముతో గానమొనర్చుచు సేతునిర్మాణ మొనర్పసాగిరి.

## వానరగణము

కంధిపైన వంతెననిక కట్టండోయ్ కట్టండీ.

అద్రిరాజు కళేబరము నరయుచు
మత్తగజముబోలు శిలలనెత్తుచు
వారధిలో వానినెల్ల మొత్తుచు
వంతెనతో జోడించి, లంకను మనవంకకింక లాగండోయ్
లాగండి. 1.

వృక్షమ్ముల గిరితరులన్ విసరండోయ్
వీని జలధి తలను దాల్చు కనరండోయ్
అవలి తీరభూమి నిందు లాగండోయ్
శేషునివలె బడబాగ్ని సేతువునే తలధరించు లేలెండోయ్. 2.

రామభక్తి కడుపునిండి వచ్చినది
వనధిని శతతీర్థమ్ములు ప్రాలినవి
భవ్యకార్యమొనరించెడి పథికులకై
శ్రీరాముని వీపునగోని చిందులిడగ వానరులను చూడండోయ్. 3.

నలుడు లభించెను మనకై నాయకుడు
కరయుగములు కోట్లకొలది కష్టించుడు
ఈ రూపము వచింప మొదలిడినపుడు
అవలీలగ పాషాణములన్ని నీటిపైన తేలియాడండోయ్. 4.

శ్రీపతిపద మద్ధిప్రవేశించినది
వే నదులకు తీర్థతయె లభించినది

చివర మొదలు కొరకు నిరీక్షించినది
శిలలన్నియు నలలపైన, నడరు నలలవోలె పొదుగబడెనండోయ్. 5.

కపిగణములు చేయవలెను గర్జన
రఘుపతిరాఘవ పతీతపావన
జయలంకారీ జానకిజీవన
అని యని సేయుటకు మొదలె, మించుచు రణభేరిని
మ్రోగించండోయ్. 6.

కాదది వంతెన శ్రీమముల క్రతువది
హార్యాశయమతి విశాలమైనది
ఈతని శుభనామ సన్మహిమయిది
సంఘకార్యమగు దీనిన్ సకలదిశలునిలిచి చూడసాగెనండి. 7.

ఢమఢమ ధ్వని మ్రోగించుడి ఢంకా
విజయరాఘవుడు గెలిచెను లంకా
చెరవిడె మైథిలికి, లేదు శంకా
బలహీన మహాంధకార వనధి, సేతు విద్యుల్లత వెలిగెనండీ. 8.

# 43

"కంధిపైన వంతెననిక కట్టండోయ్."

ఈ గీతమును బాడుచు వానరులు సముద్రముపై 23 యోజనముల పొడవు వంతెనను నిర్మించిరి. రామసుగ్రీవుల పద్మావధిసైన్యము పెద్ద పెట్టున గర్జించుచు సముద్రమును దాటుచుండెను. సిద్ధ చారణ మహర్షి గణములు మరియు వర్తమాన దేవతలును శ్రీరాముని యభీష్ట పూర్తిని మనసార చింతించిరి.

శ్రీరాముని సైన్యములోని బలాబలాలు తెలుసికొనుటకు రావణుడు గూఢచారుల నంపెను. వారు రాముని సేనాసముద్రపు బ్రహ్మాండమైన శక్తి సామర్థ్యముల రావణునకు నివేదించిరి. అదియుగాక స్వయముగా రావణుడు తన శ్వేతప్రాసాదముయొక్క సౌధాగ్రమునుండి ఆ సేనాసాగరమును ప్రత్యక్షముగా చూచెను. ప్రతి వీరుని బలము గూఢచారులనోట వినెను. వినియును తనమంత్రులను బిలిపించి యుద్ధసన్నాహముల గావింప నాజ్ఞాపించెను. రావణుని చిన్నతమ్ముడగు విభీషణుడంతకుముందే శ్రీరాముని సత్పక్షమునకేగి చేరెను.

కపటమును అవినీతిని ప్రేమించు రావణుడు విద్యుజ్జిహ్వుడను రాక్షసునిచేత శ్రీరాముని మాయాశిరమ్ము సిద్ధముచేయించుకొని అశోకవనమందలి సీతకడకేగెను. వెటకారపునవ్వులు నవ్వుచు సీతతోననెను. "సీతా! ఏ శ్రీరామచంద్రుని కొరకై తే నీవిన్నిరోజులు నా మన్ననలను అంగీకరించకుంటివో ఆ శ్రీరాముని వధయైనది. ఇదిగో ప్రహస్తుడను నా సేనానాయకుడు రాముడు పడియుండగా నతని శిరస్సు ఛేదించుకొని తెచ్చెను. వానరసైన్యమంత భయకంపితమై యున్నది. ఇదో నీ రామచంద్రుని ధనుస్సు మరియు శరీరమునుండి వేరైన శిరస్సు.

అచ్చము రామునితలవలెనేయున్న యాశిరమ్ము పరికించి శిరమ్మురమ్ము బాదుకొనుచు నేడ్చు సీతదుఃఖమున కవధులులేకుండెను. గుండె పగులునట్లుగా రోదించుచు సీతయిట్లు తలపోసెను.

## సీత

వినుచుంటినేమి కనుచుంటినేమి ఈ యవస్థ
ఇదియేమి? పలుకవెందులకు నాస్వామి.

సతికన్నముందు పతిమరణంబా యిదియెట్లు సంభవమ్మొ
ఖడ్గమ్మువోలె నామీద చివర విరుచుకపడె దైవమ్మొ
హతపుణ్యయయ్యేనే కౌసల్యాయవధీరిత పౌలోమి. 1.

జ్యోతిష్కుల యా గ్రిహచారపులెక్కయె మొత్తము తప్పినదా
ఈ యభాగిని, యకస్మాత్ తనసర్వస్వము గోల్పోయినదా
ఈ మూఢవలన ధూళినిదురజెందెనె రాముడు ఖగగామి 2.

ఈ నేత్రపద్మముల గుర్తింతును శ్రవణములను గుర్తింతు
ఈ దీనశోకరుతిపట్టిన నిద్రయు ముగియదనుచునెంతు
సృష్టిగతిహీనమై దశదిశలును కడుశూన్యమయ్యెనేమి. 3.

బంగారపువిల్లును గుర్తింతు మహాబాహూ వెచటనుండె
ఆ శ్యామలసుందరమూర్తి ఎపుడు దర్శనమునీయనుండె
ఏడ్చి ఏడ్చి కనులెండె తనువు లాజలుగా వేగుసుమీ. 4.

మనదగు వివాహమున శపథమొనర్చినమాట మరచినారా
అడగకుండగనె సతివీడి యిట్లు మీరై దివికేగితిరా
తమదరిగల యీజనకాత్మజా తయార్తధ్వని వినవేమి. 5.

రఘుకుల తిలకా ! దివినిజేరి పితరులను గలసినారా ?
దారిమధ్య పరహస్తంగత నర్ధాంగి వీడినారా !
రఘుకులజాతున కీర్తులు శోభించునటే స్వామి ! 6.

అగాధజలనిధి దాటియేల జాయార్థము వచ్చితివి
కులనాశిని ఓసీతా ఎటులిల కడుపున బుట్టితివి
జనకుడుజేసిన యజ్ఞపు ఫలితం బిదియేనాయేమి! 7.

ఓ లంకేశా ! యేశస్త్రముతో నా నాథు వధించితివో
ఆ శస్త్రముతో నాతల దునుమగ ననుమానించెదవో
చివరకు రామునితోఁవన ననుజననిమ్ము దుష్టకామీ. 8.

# 44

"ఇదియేమి పలుకవెందులకై నాస్వామి."

ఇట్లు శ్రీరాముని ఖండితశిరస్సుతో విపరిభాషణలు చేయుచు రోదించు చుండగానే ఆమె మూర్ఛితయైనది. సరమా అను పేరుగల రాక్షసస్త్రీ ఎప్పుడైతే నిజమగు విషయమును దాచకచెప్పినదో ఆయమకు పోయిన ప్రాణములు తిరిగివచ్చినట్లయ్యెను. శ్రీరాముడు సజీవుడైయున్నాడని సరమ నోటినుండి వినగానే ఆమె కన్నులలో తనప్రాణములు నిల్పుకొని శ్రీరామ సందర్శనమునకై చంద్రచకోరన్యాయముగా ప్రతీక్షించసాగెను.

శ్రీరాముడు లక్ష్మణుడు, మరియు సుగ్రీవుడు మొదలుగాగల వీరులు సువేలపర్వతము నారోహించి లంకావిస్తీర్ణమును చూచుచుండిరి. విభీషణుడు వారికి అన్నిమర్మములు చెప్పుచుండెను. అపుడే సుగ్రీవుని కన్నులకేదో కనిపించి యతనిదృష్టి యావంకకు మరలెను. లంకాపతి రావణుడుగూడ తనప్రాసాద సౌధాగ్రభాగమున నిలిచి రామసేనను నిరీక్షించు చుండెను. అతనిని చూడగానే సుగ్రీవుడు సువేలపర్వతమునుండి ఎగిరిపోయి రావణునితో కలియబడెను. ఉభయులును భయంకరముగా నొకరితోనొకరు పోరాడు చుండిరి. రావణుడు తనమాయాశక్తిని ప్రదర్శించెను. ఇది గుర్తెరిగిన సుగ్రీవుడు అతనిపట్టు విడిపించుకొని తిరిగి శ్రీరామునివద్దకు వచ్చిచేరెను.

సుగ్రీవుని శరీరమునిండా గాయములు పడియుండెను. రాముడతని ప్రేమమీర కౌగిలించి వీపునిమిరి సౌమ్యస్వరమున నిట్లనియెను.

## రాముడు

సుగ్రీవా యీ అతిసాహసవిధి
శోభించదు భూపతివగు నీకిది.

ఎటుజనిన ప్రమాదకర క్షణమ్మిది
కపటి రావణుడు ఘనమాయావధి
ఏమరుపాటున పైబడ మనకది
ఏమిజరుగునో ఎట్లు తెలియునది 1.

విభీషణుని నను విచారించకయె
సౌమిత్రిని నను సంప్రతించకయె
ఎవరికి నూహించగ తావీకయె
దూకుతెగువ యెందులకు గల్గెనది 2.

నాకుతెలియు నీ యపారశక్తి
అవగతమే నీ యనంతభక్తి
ఐన తగనిదిపు డట్టిప్రసక్తి
అనుకొననిదేదో యైనట్లున్నది. 3.

రావణుడని జేసినచో నీవధ
వానరసైన్యంబంతయు వృథగద
ఎందుకు కపియూథపగణముల రొద
వ్యర్థమె ఈ ఋక్షమ్ముల గణమది 4.

శత్రుదమన నీకేమి చెప్పుదును
రాజులు తలపరు రణావేశమును

మొదలు ప్రణాళిక పిదప విజయమును
విచారహీనునకు విజయమెచటిది 5.

దశవదనునితో తలపడ నున్మద
దగ్ధయోగమెదొ దాపురించినద
గొప్పస్నేహితుని కోల్పోదునుగద
నిరాశయేగద నీ సేనలకది. 6.

ఈ ద్వంద్వముతో నింతే లాభము
పొంగజేయు రావణునీ విజయము
రణోన్మాదమగు రాక్షసగణము
కపిగణమును వెనుకంజ వేయునది 7.

రహిజయించెనో రావణశక్తి
ఇలాత్మజకు నపుడెచటి విముక్తి
సర్వమువ్యర్థము శపథము సూక్తి
అపుడెవరసురుల హతమార్చునది 8.

చను త్వరగాచను సైన్యముగూర్చుము
యుద్ధకోవిదా వ్యూహముపన్నుము
బంధులతో రావణుని వధింతము
వ్యర్థపరచుకుమి మనశౌర్యమ్మిది 9.

## 45

"సుగ్రీవా ! యీ అతిసాహసవిధి శోభించదు."

రణనీతికోవిదుడైన రామచంద్రుడు సుందరభాషణల సుగ్రీవునకిట్లు చెప్పెను. వారందరును గిరిశిఖరాగ్రమునుండి క్రిందికి దిగివచ్చిరి.

సర్వశాస్త్ర సమ్మతమగు సముచిత సమయమును గుర్తించి సమరమును ప్రకటించిరి. ఉప్పొంగు ప్రళయార్ణవమువలె నురుకులు వెట్టుచు గర్జించుచు వానరసైన్యములు లంకవైపునకు తరలుచుండెను. ఆ విలయగర్జనముల వికటాట్టహాసముల పర్వతములతో వనములతో వీధులతోసహా బ్రహ్మాండ ఖాండము కంపించసాగెను. ఇంతలో నిరుసైన్యములలో యుద్ధోన్మాదములు చెలరేగి మారణహోమములు ప్రారంభమగు సూచనల గుర్తెరింగి రాజధర్మ మర్మజ్ఞుడగు రాముడు అంగదునిబిల్చి యిట్లనెను.

## శ్రీ రా ము డు

చనువేజని రావణుతో నను మ అంగదా — (ఏమని)
కడకొకపరి విచారమును గావింపు బుధా

'జలధిదాటి పురముఖమున నిలిచె రాముడు
రణరాగోన్మత్తులైరి వానరులిపుడు
మదమువీడి రాముని శరణనుము సర్వదా' 1.

అజవరప్రసాదమునన్ హద్దుమరచుటా
పృథ్వినెల్ల పీడించితి పాపసంగతా
నాగదేవతాప్సరసల కలచితివి సదా ! 2.

'నీదగు గర్వాంధతమము బోదోలగను
సైన్యప్రభలరఘుకుల రవిసరిగదోచెను
కాల్చివేయు సకలవంశ రాజ్యసంపద' 3.

శంఖరవళి వినుము చూడు ధరణివడకెను
అసురకులము నీ మూలమ్మంతరించును
నీతృష నేడైన విడువుమో ఘృణాస్పద' 4.

"చిట్టచివరకైన మూఢవృత్తి విడువుము
ఆ రాఘవునకు మైథిలి నప్పగించుము
శరణుజొచ్చి రామచంద్రుఁ దొలగు మాపద" 5.

"తరుణమెరిగి యుద్ధమందు స్థిరతనుండుము
శ్రీపతి బాణము నినుగొనిపోవు స్వర్గము
మోక్షమార్గ మిదియొకటియె మిగిలినది గద" 6.

"ఆనాడెటు సీతనీవు హరియించితివో
బలమాయాయుక్తి పోరి గెలువజాలవు
దునుమునె వజ్రమును శరము మేరువునుగద" 7.

"అవని స్నీ పేరు నిలుచుట శక్యమగు నూ
నృపుడో విభీషణుడె రామకృపను పొందెను
లంకనతడె యనుభవించు రాజ్యసంపద" 8.

## 46

"చనువేఁజని రావణునితో ననుము అంగదా!

శ్రీరాఘుని యీవార్తను అంగదుడు వెడలి రావణునితో నున్నదున్నట్లుచెప్పెను. ఆమర్మముల దూరిచను మాటలువిను రావణుని దురాగ్రహము మేరలు మీరెను. అతడు మతిమాలిన యీ కోతిని చంపవలసినదిగా తన యమాత్యుల కాజ్ఞాపించెను. రావణుని యాజ్ఞానుసారము రాక్షసులెందరో చని అంగదుని శరీరమునకు పాములవలె పట్టికొని గిచ్చసాగిరి. అ మహాబలాఢ్యుడైన వానరుడు వారందరితోపాటు ప్రాసాద శిఖరాగ్రభాగమున కెగిరి చనెను. ఆ యెగురుటలో రాక్షసులందరును పట్టువిడి పైనుండి ఇలాతలమున పడిపోయిరి.

అంగదుని భారముతో ఇంద్రవజ్రహతిచే హిమాలయము క్రుంగినట్లు రావణుని మహాప్రాసాదము భూవలయములోనకు క్రుంగికూలెను. శిఖరము ఛిన్నాభిన్నమై క్షితిపై పడిపోయెను. అంత రావణుడు అదిగని క్రోధావేశముతో సైన్యమును చప్పున కదిలిరావలసినదిగా ఆజ్ఞాపించెను. తరువాతి కథాక్రమమును వర్ణించుచు కుశలవులిట్లు పాడిరి.

శంఖ దందుభీనాదము లాకాశము చీల్చుకవచ్చె
అనుపమ రాఘవ రావణయుద్ధమ్మది మొదలై హెచ్చె

సశంఖ రాక్షస గణమగుపించె
మబ్బుల కొంగల మాల రచించె
ముఖముల వడి పిడుగులు గర్జించె
రణాంగణమ్మున శరవర్షమ్ములు గురిసినవనిపించె 1.

తక తకనెగురుచు సకిలిచె హయములు
నాదసమన్వయ నాగ గర్జనలు
రాక్షస కపి పదరవములునా నాదములకు లయవైచె 2.

పండ్లను పెదవులపై బిగియించు
దైత్యులు వానర తాడన చేయుచు
సదేహకపితతి చదలనెరుగుచు
తరులును గిరులును శస్త్రములుగ నాదైత్యుల మర్దించె 3.

జయ దాశరథీ జయ తారాసుత
అనిగర్జిలి కపి యసుర(దన్నె క్రుధ
కొట్టి రస్త్రముల పట్టిరి గుత్తా
పూర్ణ జలధులిల ద్వంద్వార్థము నుప్పొంగుననగదోచె. 4.

తాకునంత శూలము గద శక్తి
వానరులసురులు వడసిరి ముక్తి
తమ రక్తములో బడచు విముక్తి
జయలంకాధిప ఘోషలొప్ప రాక్షస సంతతి యరచె 5.

వాజులు వ్రాలె ద్విపమ్ములు కూలెను
వక్రత శరముల వర్షము గ్రాలెను
చంపుడి, కొట్టుడి తరుముడి భటులను
అనియెడి సంహారార్థభాషణము లంతట వ్యాపించె 6.

నవ్వుచు రణమరణము గను వారి
ముఖము విప్పె మాంసపంక వారి
అవియు త్రొక్కబడు నంఘ్రులజేరి
ఎర్రటినెత్తురు యుద్ధభూమిలో నేరులబారించె 7.

శవములపైపై శవములుగూలె
కపులు సురలు ఋక్షములు తెలియలే
యములకంటె భయదములు శౌర్యములె
అవయవభాగములెన్నొ యోజనము లాకసమునలేచె. 8.

హస్తలాంగులములంఘ్రి చక్రములు
గ్రీవఖండములు శిరములు పదములు
నూర్లతునుకలై నేలంగూలు
అచటప్రళయగతి ధరణి గగనములయంగము కంపించె 9.

ఎవరికెచ్చటనొ పవరము జతపడు
మృత్యుముఖమునుండెవడొ బయటపడు

కననట నెవరిదో కబంధమాడు
ఈ గడబిడలో నెవరిసోయి యెవ్వరికిలేక కలచె 10.

# 47

"అనుపమ రాఘవరావణ యుద్ధమ్మది మొదలై హెచ్చె."

ఈ భయంకర సంకులసమరములో శ్రీరాముడు తాను రావణుని సారథిని వధించెను. రథమును విరిచివైచెను. ఛత్రముతోగూడిన కిరీటము నెగయజిమ్మి నేలగూలజేసెను. ఊపిరియాడకుండ శరవర్షము గురిపించెను. రాముడతడు పూర్తిగా అవశుడైనాడని తెలిసి యుదారహృదయముతో నిట్లు పలికెను. "రావణా! నీవుచాల యలసిపోయినవానివలె నగపడుచున్నావు. నేడింటికేగి శ్రమదీర్చుకొని రేపు తిరిగిరమ్ము" అననంతనే రావణుడు తానవమానితుడై చేయునదిలేక అట్టి దైన్యపరిస్థితితోనే యింటికి వెడలెను. తన తమ్ముడైన కుంభకర్ణుని మహానిద్రనుండి మేల్కొల్పుటకు రాక్షస గణముల నియోగించెను. ఆ మహాబలాఢ్యుడగు కుంభకర్ణుడు ఎనిమిదేసి మాసములు నిదురబోవుచుండెడివాడు అతనినా నిద్రావస్థనుండి లేపుటకై పటహకాహళభేరిఝాంకారములు చెవులయొద్ద మ్రోగించుచు ప్రచండ శంఖారావములొనర్చుచు కుంభవాద్యముల భీషణ ఘోషనొనర్చిరి. శరీరమును ఏనుగులతో త్రొక్కించినను కేవలము రోమములుమాత్రమే కదలునట్టి మహా భీకరాకారుడైన కుంభకర్ణుడావులించుచు ఒడలు విరుచుకొనుచు మెల్లగలేచెను.

రావణుడతనిగాంచి తాను రామునితో యుద్ధములో ఓడిపోయివచ్చిన దైన్యస్థితిని తెలిపి, ఎంతో వినయముగా జాలిగొల్పు స్వరముతో సహాయ మొనర్చుటకునై యాచించెను. అంత కుంభకర్ణుడతనిని గాంచి హసించి యిట్లనెను.

## కుంభకర్ణుడు

ఉచితవేళ లేపితిరి సహోదరాననను
సంకట కాలమ్ము వచ్చె లంకపైనను

పాపికి నాత్మఘాతము
దుష్కృతి కిదియొక నరకము
హతవిధి నియమిత నియమంబదెటు తప్పును 1.

నీమది అనరాని పొగరు
విషమయమై యాయువదరు
హితమధుర సుభాషితమ్ము లెటురుచించును 2.

విభీషణుని సత్యసూక్తి
హితోక్తి నీకు విషభుక్తి
అవమతించి గోల్పోయితి వాస్తమిత్రును 3.

నిత్యము నీ భార్యనుడివె
హిత మహితంబగుచు నొదవె
కాలుక్రింద రాచితివా కల్కిహితమును 4.

దేశకాలములను గాంచి
మంచి చెడును గుర్తించి
కేలిడ నీ వెన్నడట్టి కృతికి నెందును 5.

నచ్చినదే నిర్ణయము
లేదు విచార వినిమయము
ఏ సచివుని సంప్రతించ వీవు నెపుడును 6.

ప్రియభాషలె వినినావు
విగత ప్రియము విడినావు
అకటకోరి వరియించితి వాత్మ ఘాతను 7.

ఉపదేశ సమయము కాదు
లంకేశా ! భయములేదు
ఈ తమ్ముడు కర్తవ్యము నెటులు మరచును 8.

సోదరతయె నన్ను పిలచు
తత్ప్రభావ మాజిగాంచు
శత్రురక్తసిక్తముగను జేతు వసుధను 9.

వజ్రి సహజ వధ్యుడవిన
రాముడెంత నా కరమున
మ్రింగు దగ్ని త్రాగి వేతు క్షీర సింధును 10.

వచన మిత్తు మునుజయమని
సుర ద్రావము సుఖమనుకొని
నీసకలభరము భుజాల నిల్పుకొందును 11.

# 48

"సంకట కాలమ్మొ వచ్చె లంకపైనను"

కుంభకర్ణుని యీ యాలోచన మది సముచితమైనదే ఖండన ఖీముడై యత డపరిమిత బలపరాక్రమముల ప్రదర్శించెను. చేతికి దొరికిన కోతులమూకల లెక్కజేయక బుక్కపెట్టుచుండెను. వీరవర్యులని పేరుగనిన మహావానరుల మంటగలిపెను. ముఖ్యుడైన సుగ్రీవుని గూడ మూర్ఛితు నొనర్చెను. ఆదిశేషావతారమగు లక్ష్మణునికి గూడ నదుపులోనిడ రాకుండెను. కాని ఎట్టకేలకు రఘువరు డతని కరపదముల నరికివేసెను. పర్వతమువలె ప్రచండమైనవాని మహాకాయమును శరపరంపరాహతి నంతరిక్షములోనకు బంతివలె నెగురజిమ్మెను. ఇంద్రజిత్తు మొదలుగాగల యతిలోకబలశాలుర రావణపుత్రుల రణరంగమున మరణమొందించెను. ఇదిగని క్రోధావేశముతో వెఱ్ఱివాడైన రావణుడు తాను ఒంటరిగా రామునిపై బడి యుద్ధమొనర్పసాగెను. రామరావణులిట్లు లెక్కలేని శస్త్రాస్త్రము లొకరిపై నొకరు వర్షింపసాగిరి. చేతులు ముడుచుకొని రామరావణులు కూర్చొనియుండ శస్త్రాస్త్రములే తమంతతాము సమర మొనర్చుచుండెనో యన భాసించుచుండెను. సప్తసాగరములు సంక్షోభించెను. పాతాళవాసులగు పన్నగదానవులు భయకంపితులైరి. బ్రహ్మాండములదర సాగెను. భానుతేజము క్షీణించెను. వాయుసంచారము స్తంభించినది. రాముడు సర్పాకృతిలోనున్న యొకశస్త్రమును ప్రయోగించి రావణుని శిరస్సును చెండివైచెను. కాని, యెంత యాశ్చర్యము! దానివంటిదే మరొక శిరస్సు ఆస్థానములోనే యమర్పబడి యుద్ధమునకు సిద్ధమగుచుండెను. ఈ రీతిగా నూరు శిరమ్ముల శ్రీరాముడు ఖండించుచువచ్చెను. ఖండించిన కొలది వాని మొండెముపై తలవెన్కతల మొలచుచునే యుండెను, రావణుడంతరించు సూచన లేమాత్రము కనిపించుటలేదు.

చింతాక్రాంతుడై శ్రీరాముడు యుద్ధములో తన సహాయార్థము దేవేంద్రుడంపిన రథసారథియగు మాతలిం గాంచి యిట్లు వచించెను.

113వ పేజీ, 48 నం॥ పాటలోని 4వ పాదము తరువాతి చరణములు 5, 6, 7, 8 కలిపి చదువవలెను. అవి ప్రత్యేకముగనీ పుటలో ముద్రితము లైనవి.

ఖరుజంపితి దూషణుని వధించితి
మారీచ విరాధుల మధియించితి
ఒకే బాణమున వాలిలోన లేకుండగజేసితి ప్రాణము. 5.

దేనిథాకకే మరలె సాగరము
భయాదరములకు నదియాగారము
ఆ తూణములం గౌరవడెనే విజయప్రద శరసంతానము. 6.

దనుజుడు సచేల రుధిరస్నానము
చేసి సింహమటు సేయు గర్జనము
నాకునుగూడా అవధ్యమే యీ రూపొందిన యభిమానము. 7.

ఆత్మగుందెదరో అమరు లప్సరలు
మునివరులకు తపము దోచునెటులు
వ్యర్థమ్మని యనవలసినదేనా
నాదగు శరసంధానము. 8.

రాముడు

ఏల యిట్లు నిష్ఫలమగు బాణము
పుణ్యముడిగెనా బాహువులందయి పోయినదోనా త్రాణము

నా శరవర్షము దారుణమైనను
తరువటు రావణుడిటు చివురించును
రామునెదుట నెటు దక్కుచుండె నిటు రామునిశత్రుప్రాణము 1.

వింతయిదేమియొ నాకెటు తెలియును
శిరము తరిగినను మరొకటి మొలచును
రావణులోన సజీవ శిరమ్ములగని యెదియున్నదొ కానము 2.

నూర్ల శిరమ్ముల నిటులే నరికితి
నభమున చిమ్మితి పదమున ద్రొక్కితి
రథమున మరలన్ రావణుకుండును నూతనమగు అభిమానము 3.

వీర మాతలీ ఇంద్రసారథీ
దీని రహస్యము తెల్పవే సుధీ
సహింపరానిది నాకన్నను నాశస్త్రవిద్య అవమానము 4.

## 49

"ఏల యిటు నిష్ఫలమగునీ బాణమ"

శ్రీరామునివంటి సమర్థుడగు వీరశిరోమణి నోటినుండి వచ్చిన యీ మాటలువిని ఇంద్రసారథియైన మాతలి కొంచెము నవ్వి, "ప్రభూ! ఏమి తెలియనివారివలె నిట్లు మాట్లాడుచుంటిరేమి? రావణవధార్థము వైశమె

పితామహాస్త్రము ప్రయోగింపరేల ? దేవతలు నిర్ణయించిన రావణమృత్యు సమయ మాసన్నమైనది ఆలసింతురేల ?

మాతలి మాటలు వినగానే స్మృతినభినయించుచు శ్రీరాముడు అగస్త్యప్రదత్తమై కనుల మిరుమిట్లు గొల్పు ఆయస్త్రమును ధనువునందెక్కి-డెను. ఆ కర్ణాంతము లాగి మహాప్రతాపశాలియగు రావణునివైపు వదలెను. సాక్షాత్తు మృత్యుస్వరూపమగునాదుస్సహపితామహాస్త్రము రావణునివక్షస్థలమున దూరి వానిహృదయము సహస్రఖండములుగా చీరి శాంతించినది. ఆయమోఘాస్త్రవ్యాఘాతముతో చేతమ్మును కోల్పోవుచున్న రావణుని కంమునుండి శరశరాసనములు జారిపోయి ధారుణిపై బడిపోయెను. ఆ మహాతేజస్వియగు లంకాపతి నేలగూలెను. రాక్షససైనికులు దారికొకడై పారిపోసాగెను. దానవాధములగు వారిని వానరులు ధ్వంస మొనర్పసాగిరి. వానరసైన్యము లన్నియు "రావణుడు మరణించెను రాముడు జయించెను" అని నినాదము లొనర్చెను. ఆ నినాదములన్నియు మిన్నుముట్టెను. కపిసేనలు ఆనందాతిశయములో రామవిజయమును గానమొనర్చుచు నృత్యము చేయుచుండెను. ఆకాశములో దేవదుందుభులు ప్రసన్నములై వినిపించినవి. రాముని రథముపై సురలు పుష్పవృష్టిగురిసిరి. యక్షకిన్నర గంధర్వాప్సరలు విజయ గీతములు పాడిరి.

## గంధర్వులు

సురలు గనుగొనుడి రామలీలా
ధరిత్రిని రావణవధశీలా

దశదిశలును ముఖములు వికసించెను
అవని కంపనలు నంతరించెను
రవిప్రభలకు స్థిరత్వము గల్గెను
వచ్చెను మహద్భాగ్యవేళ 1.

'సాధు' 'సాధు' అనసాగిరి మునులు
ప్రోగించిరి కిన్నరులు వాద్యములు
సంతోషమ్మున పొంగె లోకములు
అమర రిపు చనిపోయిన వేళ 2.

రణమునసాగెను విజయనృత్యములు
నృపసహితము విజయులు కపిగణములు
చేసిరి శ్రీరాముని పూజనములు
మెడనిడి సూన పత్రమాలా! 3.

జయ జయ యనుడీ ఉచ్చైస్స్వరముల
విసరుడి కల్పక లతాసుమమ్ముల
మహిజల్లుడి సన్మణిభూషణముల
జయశ్రీ వరించె సత్యముల 4.

ధర్మాత్ముడు శ్రీరాముడు శ్యాముడు
చక్రధారి శ్రీనారాయణుడు
జగదుత్పాదక భువనజీవనుడు
ఇడి రతనికి నర రూపాల 5.

సృష్టిస్థితి లయకారకు డితడు
త్రిభువన తారక పద్మనాభుడు
ఖల సంహారైక శరణ్యుడు
వలచె బ్రహ్మాండావన శ్రీల 6.

శ్రీవత్సమునురమున ధరియించు
'సాధుల' సుజనుల సంరక్షించు

సత్య పాశీకత సదాచరించు
ఈత డొక డెరుగు దీనిగోల 7.

రాముడె విష్ణువు, లక్ష్మియె సీతా
మాయామానుష లీలకు నేతా
జగద్రక్షణకై యుద్ధము నేత
కాంచు డనుపమము రామలీలా ! 8.

# 50

"సురలు గనుగొనుడి రామలీలా ధరిత్రిని రావణ వధశీలా"

శ్రీరాముడు రావణుని యంత్యక్రియ లొనర్పవలసినదిగా విభీషణునకాజ్ఞాపించెను. "చావువరకే శత్రుత్వముల సాధింపులుండదగును. మన వచ్చిన పనియు పూర్తియైనది. రావణుడు నీకెట్లో నాక ట్లే, దహనసంస్కార మొనర్పుము" అని రఘుపతి వచించెను. రావణవధవలన నతని యంతఃపురములో దుఃఖవర్షము ప్రవాహములై పారినది. రావణవధానంతరము రాముడు తన కర్కశస్వరూపమును వీడి సౌమ్యవిగ్రహుండై కానిపించెను.

అంజనేయునితో తన కుశలవర్తమానము జానకీదేవికి నివేదించవలసినదిగా శ్రీరాముడు చెప్పెను. మారుతిచెప్పిన రాముని విజయవృత్తాంతముతో కుశలవిశేషములతో సీతకు ఆనందాతిశయముతో మాటనోటరాకుండెను. "భక్తవత్సలుడైన భర్తను నేను చూచుటకు కుతూహలపడుచున్నాను" అని ఎట్టులో జానకి వచించెను.

ఆమె ప్రస్తుతావస్థను హనుమంతుడు శ్రీరామునితో చెప్పెను. అపుడు శ్రీరాముని నేత్రములుకూడ అశ్రువారిచే నార్ద్రములైనవి. సీతను తన వద్దకు వెంటనే తీసికొని రావలసినదిగా విభీషణునికాజ్ఞాపించెను.

సీత రామునిముందునకు వచ్చినది. సతీపతులు పరస్పర ముఖావలోకన మొనర్చికొనిరి. సార్వభౌముడగు రామచంద్రుడామెతో సౌమ్యస్వరమున నిట్లువల్కెను.

ఎన్నియత్నముల నిన్నుగంటి భూజాత
విరహితా! చారుతా! సీతా!

ముగిసినది భయంకర రణము
దండించితి రాక్షసగణము
శమియించె నింక నాగ్రహము
రాజోచితకార్యము జేసితి సుగుణవ్రాతా! 1.

జేసితి నరి ప్రాణహరణము
రిపుకృత పరిభవ మపహతము
తలయెత్తె తిరిగి గౌరవము
నీ భాగ్యముగదె శ్రీరాముడు కపికృతజేత 2.

అయ్యెను శపథంబది పూర్తి
నిష్కళంకమయ్యెను కీర్తి
కాంచితిని ప్రేయసీ మూర్తి
నా శౌర్యముతో వంచితము దుష్టవిధివ్రాత. 3.

నీకొఱకు జలధి లంఘించె
ఆకపి కృతకృత్యత గాంచె
సుగ్రీవ యశశ్రీ మించె
సురలలనలు పాడిరి సన్మంగళగీతి 4.

చేసితివిది నీ మూలమున
నీకొరకుగాదు అంగన
కడిగితిని కళంకము నేన
రఘువంశమునకు గతగౌరవమబ్బెను సీతా 5.

రుగ్నాయితనేత్రుడు లలనా
దీపోత్సవ హర్షము గనునా
యది సంశయాస్పదంబయినా
నీపై విశ్వాసంబెటు గల్గును శ్రీకాంతా ! 6.

రావణుడు కపటి దుష్కామి
తన్నికటస్థిత వీవుసుమీ
కనులతో భృకుటి యఘగామి
ఇక నింతకంటె స్పష్టంబేమను జననేత ! 7.

నా కర్తవ్యము చేసితిని
దశదిశలు నీకె విడిచితిని
అడుగవలదు నా యనుమతిని
సఖి ! నీ నా సంబంధమునకు తగిలెను ఘాత 8.

# 51

"ఎన్నియత్నముల నిన్నుగంటి భూజాత."

ఈరీతిగా రాముడు కఠోరభాషల నాడినపుడు మహాసాధ్వియగు జానకి హృదయమేమై యేయవస్థకు గురియైనదో మాటల కందుబాటులో లేదు. ఆమె నేత్రములనుండి బాష్పములు వరదలై ప్రవహించినవి. ఆమె రాముని పాదసాక్షిగా తన శుద్ధతనుగురించి ఎన్నియోమారులు వచించెను. కాని

కర్తవ్యకఠోరుడైన శ్రీరాముడు చలించలేదు. చివరకు మార్గాంతరములేక దేవతాసమానురాలైనసీత లక్ష్మణునితో దేహత్యాగమే మార్గాంతరమని చితను సిద్ధపరచవలసినదిగా వచించెను. విభీషణుడు లక్ష్మణుడు మొదలైనవారికీ విషాదకర సంఘటన వలన మితిమీరిన దుఃఖము కలిగెను. కాని శ్రీరాముని మనసుమార్చుటకు ఎవరికిని శక్తి చాలకుండెను.

చిత సిద్ధమయినపిదప సీత తాను శ్రీరామునిచుట్టు మువ్మారులు ప్రదక్షిణమొనర్చి అగ్నిజ్వాలలలో నొకజ్వాలపోలిక చితయందు దూరెను. సైన్యమంతటను ఈ దుఃఖకరసంఘటనను గాంచునపుడు హా, హా, కారములు చెలరేగెను. కాని కొంచెము సేపటిలోనే చితనుప్రక్కకునెట్టుచు అగ్నిహోత్రుడు ప్రత్యక్షమై సీతను తీసికొని రాముని సన్నిధికి వచ్చెను. పావకుడు సాక్షాత్తుగా తానారామునితో "రామా? ఈ నీసీత పునీత, నిష్కళంక, పాపరహిత, ఈ సాధ్విని నీవు నిశ్శంకగా స్వీకరింపవలెను ఇది నాయాజ్ఞ" యని పలికెను.

శ్రీరాముని నేత్రములనుండి యానందాశ్రులు జలజలరాలెను. అతడు గద్గదస్వరమొలయ పావకునితో నిట్లునల్కెను

## అగ్నితో

లోకసాక్షి శుద్ధగనయ్యె జానకీ లలామ
స్వామిని నాకెల్లప్పుడును క్ష్మసుతాభిరామ.

చూడకమును నాకిది తెలియు శుద్ధశీల సీతా
జనతాగ్రహమును సైచునొకో సాధుజగన్నేతా
లోకమాన్యతా బలమె కదే లోకపతికి ప్రేమ. 1.

ఆసీత నయోధ్యకు నేను అటులు కొనుచునేగన్
విషయలుబ్ధుడనరే నన్ను విభులు ప్రజలు వేగన్
నష్టపోవువాడను నేను నాదు ప్రజలప్రేమ. 2.

ఆవని ప్రజాసుఖరంజకుడై యగును తాను రాజు
ప్రజాధర్మ తత్వంబిదియే పల్కెనాకు రోజు
ప్రజలె నాకనంతేశ్వర రూపములోగుణధామ. 3.

అవసరపడ ప్రజాసుఖార్ధము అసువులీయుటొప్పు
ఈ శ్రద్ధయె నాయుదరము నందెపుడు నుండు టొప్పు
జానకి గౌఁగిలి విడువగనే సాహసింతు భీమ 4.

సీత వియోగినియై యేడ్వఁజెదరె సాహనమ్ము
నేను కంట తడినిడుదెట్లు నిలచెను సైన్యమ్ము
గడ్డకట్టినది రేవులలో కంటినీటి తేమ 5.

శ్రీమతి జానకి హృదయములోన రాముడొక్కడుండె
శ్రీరాముని యెదలో గూడన్ సీతయొకతె నిండె
అంఘ్రిసాక్షిగా మరల నదే యందు సత్యకామ 6.

వీరరావణుని హృదయములో విషయలోభమున్న
పోటుగనిన సాగరుహద్దులు దాటరానివన్న
అతడాయమ చాయనుగూడా యంటడు స్వర్ధామ 7.

అగ్నిదేవ ! ఎల్లప్పుడు మీ యాజ్ఞ మాకుమాన్యము
రమణి యగ్ని పూతగనయ్యె రామ జన్మ ధన్యము
వడసె లోకమాత నయోధ్యాప్రజ నుతసుత్రామ 8.

# 52

"లోకసాక్షి శుద్ధగనయ్యె జానకీ లలామ"

ఇట్లని శ్రీరాముడు జానకిని తిరిగిస్వీకరించిన తరువాత రామసేన
ఆనంద తాండవమొనర్చినది. మహాత్ముడగు విభీషణుని రాముడు ఆజ్ఞాపించెను.
"విభీషణా ! నాకొఱకు పోరాడుచున్న యీ వానరవీరులకు నీవు రత్నభూషణ
ములొసంగి సన్మానము సేయుము. సుఖముగా లంకారాజ్యము ననుభోగించుము.

శ్రీరాముని మనసు భరతుని కలిసికొనుటకై యుత్సుకత జెంద
సాగెను. విభీషణుడు పుష్పకవిమానమును దెప్పించెను. ముల్లోకముల
జయించిన శ్రీరాముడు తిరిగి అయోధ్యకు పోవుటకు బయలుదేరెను. పుష్పకము
నభోంతరాళములో నెగెరెను. కపిసేనలు రామునకు జేజేలు పెట్టుచు బయలు
దేరెను. శ్రీరాముడు విమానాసీనయైన సీతకు భూప్రదేశముల విశేషములు
చూపుచు కొంతకాలము విశ్రాంతి గొనుటకై శ్రీభరద్వాజాశ్రమము చేరు
కొనెను. ఆరోజే వారి వనవాసమునకు పదునాల్గు వర్షములు పూర్తియయ్యెను.

నగరము వెలుపల తాపసవృత్తితో నివసించు భరతుడు అయోధ్యా
నగరసామ్రాజ్యము నడపుచుండెను. రాముడు హనుమంతుని ద్వార తన
యాగమనవార్త భరతున కందజేసెను. భరతుని యానందము గగనమున
పట్టనంతగా ఎదిగెను. శత్రుఘ్నుడు అయోధ్యా నగరమంతట నలంకరించెను.
అనర్ఘ భూషణాంబరముల దాల్చి అయోధ్యానగర మంతయు రామదర్శనమునకు
ప్రతీక్షించుచుండెను. పుష్పకము నగరభూమిపై దిగెను. సీతతో శ్రీరామ
చంద్రుడు కనబడగానే శ్రీరామచంద్రుడు జయించుగాక ! ఆనందనృత్యముల
కేకలు వేసిరి. భరతుడు ముందునకేగి శ్రీరామచంద్రుని చరణములపై భక్తి
పూర్వకముగా నమస్కరించెను. సు[illegible] చరణపాదుకల తిరిగి వారి
పాదములకు తొడగెను. ఆనందాశ్రువులనార్ద్రమైన కనులతో భరతుడు "నీ
రాజ్యమును నీవు తిరిగి స్వీకరింపవలెను" అనెను.

శ్రీరాముడు భరతుని కౌగిలించుకొని కుశల ప్రశ్న మొనర్చెను. సీతారాములు తల్లులందరికి సవినయముగా ప్రణామ మొనర్చిరి. ఆమేలనములో కలిగిన యానందము వర్ణనాతీతముగ నుండెను. సహస్రశత నేత్రములు రాముని శ్రీపాదముల కన్నీళ్లతో కడిగిరి. సహస్రశతాధిక కంఠములేకమై మినుముట్టు నినాదముల శ్రీసీతారాములకు జేజేలు పలికినవి.

## పల్లవి

జానకిరామా ! జయవిజయీభవ జయజయజయము త్రివారము
పుష్పయానమున నవతరించెను స్వర్గసౌఖ్యసాకారము

ఎదనెంతుము నీ సుదీర్ఘాయువు
పుణ్యసతియనగ బోవును నరయువు
ఈనాడొందెను నహల్యవలెనే యీ పురి జీర్ణోద్ధారము 1.

విరహము విరిగెను హర చాపమువలె
స్వయవరంమటు సమయము శోభిలె
త్వర పడు నయోధ్యపురి యీ వేళలె
ఆనందాశ్రుల నర్పించును నమిత ప్రేమల సుమహారము 2.

పావనీ దృక్స్పర్శము వల్ల
నేడేర్పడె నీ యుత్సవ మెల్ల
మనసు మరచె పదునాలుగుయేళ్ళ
సిద్ధమొనర్చిన సింహాసనమదె చేయుము ప్రభుస్వీకారము 3.

నీ మస్తకమున నీళుల జల్ల
తీర్థత గాంచునదీ జలమెల్ల

అభిషిక్తుడవీవనునపుడెల్ల
ముని వచనమ్ములు సార్థోచ్చారణమును గాంచుత ప్రతివారము 4.

జనకకాంక్ష పూర్తిని గొననిమ్ము
రామరాజ్యమీ పురి రానిమ్ము
అమ్మ కౌసల్యనది గననిమ్ము
రాజ్ఞీసహితము పరంపరాగత మనుభవించు మధికారము 5.

ప్రజలు గనిన యా మధుర స్వప్నములు
ఫలించికనబడు ప్రత్యక్షమ్ములు
రాణిసీత, మారాజు రాఘవులు
వేదములటు రఘుకుల దీపకులను పూజించును జనవారము 6.

రామరాజ్యమది రాజిల భువిలో
'కలంకమది గనబడు నొక శశిలో
నారీకజ్జల నయనమ్ములలో'
సత్యవిచారము లయోధ్యవాసులు సరినొనర్తురాచారము 7.

వదపము సకాల వర్షము గురియును
మహి సస్యశ్యామలయై మురియును
ప్రజ స్వధర్మ తత్పరమై వరలును
'శాంతిశ్శాంతీ' యనెడి మునివాంఛిత మదిగై కొనునాకారము 8.

# 53

"జానకీరామా...జయముజయముత్రివారము"

అని జయజయకార మొనర్చి ప్రజలు శ్రీరామచంద్రుని యూరేగిం చుచు రాజప్రాసాదమునకు కొనిపోయిరి. సరియగు మూహూర్తము చూచి

శ్రీసీతారాములకు రాజ్యాభిషేక మొనరించిరి. రామరాజ్యమునకు శుభారంభ మయ్యెను. అభిషేకోత్సవములో పాల్గొనుటకు వచ్చిన రాజులందరిని యథోచితముగా సత్కరించెను. తదుపరి శ్రీరాముడంగద సుగ్రీవులతోసహా వానర వీరులనందరిని సత్కరించెను. విలువైన రత్నభూషణములతో చీనాంబరములతో వారిని యలంకరింపజేసెను. సుగ్రీవునైతే తమలో నైదవసోదరుడుగా భావించి గౌరవించెను. వారందరును ఒకటి రెండు మాసములానందముగా నయోధ్యలోనే గడిపిరి. పిదప శ్రీరాముడు సుగ్రీవుని కిష్కింధకేగి రాజ్య కార్యముల నిర్వహించవలసినదిగా నాజ్ఞాపించెను. ఈ వీడ్కోలు మహోత్సవము జరుగుచుండగానే హనుమంతుడు రాముని చరణసన్నిధికి విచ్చేసెను.

శ్రీరామచంద్ర చరణారవిందములను గట్టిగా పట్టుకొని భావస్నిగ్ధ స్వరములతో నిట్లని మనవి నొనర్చెను.

## హ ను మ ం తు డు

ప్రభూ నాకొకటే వరమిమ్మ
నీ చరణమ్మల నిలచియుండవలె నిశ్చలభావమ్మ

మనసిది చంచలతను గనకుండి
నారాముణి చరణములందుండి
ఎంతవరకు రామకథ వెలుంగునొ
అంతవరకు బ్రతుకుండగనిమ్మ ॥ప్ర॥ 1.

సతతము రాముని చరిత బాడవలె
ఎపుడు రామకథలీ చెవిబడవలె
రామ ! నాకు శ్రీరామ ధ్యాసయె
తప్పయుండరాదు తదితరమ్మ. ॥ప్ర॥ 2.

త్వచ్చరితము పావనమో వీరా !
దేవాప్సరసలు దెల్పమనసార
అది వినుటకు నై యమరత్వమ్ము
ఈ పామరునకునీ వలె షమ్మ ॥ప్ర॥

ఈనీ కథలవి యెచ్చట మనిన
అంబుదమటు జేత ఖండపాశ్రీకన
జలదమువలెనే శతధారలుగ
వడి వర్షింతును నంతట నమ్మ ॥ప్ర॥

శ్రీరామకథా చింతని గానము
అది శ్రీరాముని యాత్మదర్శనము
తలచినంత యీ దాసునకెప్పుడు
రఘుకుల దీపము గన రావిమ్ము ॥ప్ర॥

ఎంతవరకు నీజగతి, భాణషము
అంతవరకు రామకథ మాతనము
స ప్తస్వరముల జతి రామాయణ
స్వాదు వాన గానిమ్ము ॥ప్ర॥

అనేక ముఖములు అసంఖ్యాభాషలు
సకలము నుండియు నొకచే ఆశలు
రామకథా గౌరవమును వారలు
పాడవలెను సుమ్ము ॥ప్ర॥

అతిసూక్ష్మపు దేహముల దాల్చెదను
గగనిభువనముల గాలించెదను

ప్రతిష్ఠలమ్మన వలయును నాకిల
రామకథా లాభమ్మ ॥ప్ర॥ 8.

# 54

"ప్రభో ! నాకొక చే వరమిమ్ము"

హనుమంతుని యభీష్టానుసారము శ్రీరాముడతనికి యీ వరదాన మొసంగెను. రామకథ మరియు ఆంజనేయుడును ఉభయులును జిరంజీవులైరి. కాని శ్రీరాముని లీలా విలాసమింతటితో ముగియలేదు.

శ్రీరాముడు రాజ్యము చేపట్టినదాది అయోధ్య భూతలస్వర్గమై విరాజిల్లెను. భూమిపై సంతోషము సామ్రాజ్యమేలసాగెను. అఖిల ప్రజలకు నాయురారోగ్య భోగభాగ్యము లగ్గువయ్యెను. జానకీ శ్రీరామచంద్రులు సుఖ సంపదల దేలియాడిరి. ఒకసారి సీతారాములిద్దరును అశోకవనములో నాసీనులై యుండిరి. ఆవనము రామునకు కుబేరుని చైత్రరథ వనమువలె నత్యంత నిసర్గ రమణీయమై సుఖసంపన్నమై కనబడెను. జానకియొక్క తెలుపెక్కిన యంగకాంతిని చేతకానితనముతో నలసిపోయినట్లుగపడు శరీరలతను గాంచి, చిరునవ్వులు చిందులాడు ప్రేమపూర్వక సరసాలోకనములతో జానకినిగాంచి, "సీతా ! నీకేదేని ప్రియమైన కోర్కె యుదయించుచున్నదా" అనియడిగెను. ప్రాణనాధుని ప్రశ్నవై దేహికర్థమైనది. లజ్జాపూరిత దరహసవదనయై జానకి రామునిగని యిట్లనెను.

సీత

వ్రీడా శబ్దితమై పెదవుల నాగెను ఆశ
నావేవిళ్ళను దీర్చుము రాఘవ ప్రాణేశ.

నాకెందుకొావని విహరించగవలె కనిపించు
ము_క్తస్వరయగు భ్రమరివలె బాడగానెంచు
వంశవన మురళి శ్రవణముల నదించు మహేశా ! 1.

ఒగిసాధు హరిణమును నొడిలో గొనగానెంత
ఆ హరిణ విశాల నయనములనే తమిగాంతు
ముద్దిడుచు దానికై మేతనిడుదునో శ్రీశా ! 2.

నావల్కాల మంబుల నానుచు తడిగావలెను
చంకనొక ఘటము హ_స్తమున చెంబు మనవలెను.
తలమరొాక కుండ బరువలరవలెను జగదీశా ! 3.

తరు కందమూలముల త్రవ్వితీయవలె చాల
వానిపై పొరను కేలూని తీయవలె లీల
అమృతాన్నమచట చవిజూడవలెను భూతేశ ! 4.

సంధ్యలనామ్రి తరుచ్ఛాయల గూర్చుండవలె
సురభిళితచూత సుమపాళి నుదుట జారవలె
వనరాజులు గర్జించును దూరాన జితాశా ! 5.

వీపున తూణమునిడి చేత విల్లుగొనవలెను
రహినడవుల మృగయార్థంబయి జరింపవలెను
ఘోరశ్వాపదముల గూల్చవలెను లోకేశా ! 6.

ప్రాభాతవేళ యజ్ఞవేదికడ నివసించ
అధ్వర్యగణము వేదాంతమ్మును చర్చించ
అనలారుణ ప్రభలాస్యమున నాడెను నరేశా ! 7.

నను వెఱ్ఱిదానిగని నవ్వనేలయిటు దేవా
ఆయింతమాత్రమీ హితమును దీర్చగలేవా
తరిగానివేళ పరిహాసమేల మృదుహాస ! 8.

# 55

"నా వేవిళ్ళనుదీర్చుము రాఘవప్రాణేశా !"

సీత తనవేవిళ్ళ శ్రీరామచంద్రునకు తెల్పలేక తెలిపెను. శ్రీరాముడు కూడ నవ్వి యామె యభీష్టము నాదరించెను. "జానకీ ! నీ ప్రేమాభీష్టమును వీలైనంత త్వరలో పూర్తిచేయుదును విశదపరచుము" అనెను. సతీపతుల మధ్య ముద్దుముచ్చటలుదీర్చు ప్రియసంభాషణము జరిగెను. ఇది జరిగిన మరునాడే 'భద్రుడు' అనుపేరుగల గూఢచారి శ్రీరామునితో నిట్లుచెప్పెను. "ప్రభూ ! సేతుబంధనము మరియు రావణవధ అనురెండు మీరొనర్చిన మహాఘనకార్యములకు ప్రజమీకు సదా కృతజ్ఞతలర్పించుచున్నారు. కాని" "కాని ఏమిటి ? నిర్భయముగా సత్యవార్త వచింపుము !" అను శ్రీరాముని యాజ్ఞాపాలనమొనర్చుచు భద్రుడిట్లు చెప్పనారంభించెను. "ప్రభూ ! రావణుని వద్దనున్న సీతను రాముడెట్లు స్వీకరించెను ? ఆమెతో ప్రణయకలాపము చేయుటలో ఆయనకేమి యానందము గలుగుచుండవచ్చును'' అనియనుకొనిరి. వారికి సీత అగ్నిపూతయని తెలియదు."

రామునకా వార్తవినిన తక్షణము దుఃఖము తిరిగియావరించెను. తన ప్రాణములపై యొట్టుబెట్టుకొని సోదరునకాజ్ఞాపించెను. "లక్ష్మణా ! జానకిని వాల్మీకి యాశ్రమములో విడిచిరమ్ము." లక్ష్మణాది సోదరులెవరును శ్రీరాముని యాన నుల్లంఘించ లేకపోయిరి. లక్ష్మణుడు సీతనడవికి తీసికొనిచనెను. సీత తనవేవిళ్ళు పూర్తియగుచున్నవని భావించెను. దాచుకొనలేక లక్ష్మణుడు సీతతో వచించ నామె దుఃఖమునకు మేరయే లేకుండెను. గద్గద స్వరముతో నామె లక్ష్మణునకిట్లనెను.

# సీత

ఎటబోదు లక్ష్మణా యెరిగించుము
పతిపదదర్శన మెట ప్రాప్తించును

ఎటకరుణయె కఠినత యిటుదాల్చును
ఎటసూర్యుని చీకటియే మ్రింగును
ఎటవరుణుని పావకుడే యార్పును
తొడిమవిడి శాశ్వతమె పుడమిపడెను 1.

జననీజనకుల వృధ శ్రమపెట్టితి
కన్యనుగా నాలును గానైతి
కాంస్యమె కనకపుటారగా దలచితి
ఘనసిద్ధియె తపమునగని విసిగెను 2.

అగ్నియె కల్లరియవి రుజువాయెను
దేవుని నాస్తికుడే స్థిరపరచెను
సతియె పతిత్యక్త పతితయయ్యెను
కాళులయడుగున ధర కంపించెను 3.

అసువులె పైపై నెగయగజూచును
ఈభారము నంగములెటు మోయును
నను భాగీరథి గైకొనిపోవును
అంతిమ ఘడియలెచట నాగి చనెను 4.

చనియె జీవనము ముగినెను సీతా !
ప్రసవించుటకే ప్రాణసమేతా !

కులదీపమునిడ బ్రిదుకుదు గాతా
సుమదళచని ఫలరూపము దాల్చును 5.

మరుభూమి విజన కాంతారములన్
మనిచెద రఘువంశాంకూరములన్
ఆరాముడలరు సుఖసారములన్
జనమధ్యనుండి జనకజ యేగును 6.

దేవరా తిరిగి పురిజన వచ్చున్
నామాటలమ్మలై నను గ్రుచ్చున్
పతికాడు కేవల నృపతిరాముడు
మాటాడగ నాలుక తట్టుకొను 7.

ఇటనుండె తల్లులకు వందనములు
రఘువరునకు దెల్పు ప్రణామమ్ములు
చేకొనుమివె నా యాశీస్సుమములు
పెదవులవిడి మాటయె పెకలదికను 8.

## 56

"ఎటబోదు లక్ష్మణా ! యెరిగింపుము."

ఈ సమాధానములేని ప్రశ్నతోనే గర్భవతి జానకిని గంగ యవలి తీరమునదించి ఎంతోకష్టముగా సౌమిత్రి తిరిగి అయోధ్యకు చేరుకొనెను. కర్తవ్యమును నెరవేర్చవలెనని మాత్రమే రాముడు రాజ్యపాలనా, కార్య కలాపములు నెరవేర్చుచుండెను.

ఇటసీత మహాత్ముడైన వాల్మీకిమహర్షికి చేజిక్కెను. అతడామెను తన కూతురుగా భావించి పెంచెను. ఆమె నవమాసములుమోసి కవలపిల్లల గాంచెను. ఆబిడ్డలకు భూతపిశాచాదులవలన బాధగలుగకుండ ఆ కుమారుల శరీరములచుట్టు వాల్మీకి అభిమంత్రించిన కుశ లవముల త్రిప్పెను. "కుశ" మరియు "లవ" అని వారికిని నామకరణము గావించెను. వాల్మీకి చేతులలో ఆయన వాత్సల్యదృష్టితో ఆ పిల్లలు పెరిగిపెద్దవారైరి. శైశవావస్థను ముగించుకొని యాపిల్లలు పౌఢులుగా కనిపించదొడగిరి. వారి ఆయుర్దాయములో పన్నెండు సంవత్సరములు నిండినవి.

అయోధ్యాపతి శ్రీరాముడు కేవల కర్తవ్యనిర్వహణబుద్ధితోనే అయోధ్యా రాజ్యపాలన మొనర్చు చుండెను. ఆయన సర్వశ్రేష్ఠమగు రాజసూయ యాగము తలపెట్టెను. ఆ సమారంభమునకు సహస్రావధి రాజులును-మునులును నగరమున సమావేశమైరి.

వాల్మీకిమునివర్యులుగూడ తమశిష్యులతో నచటికి వచ్చిచేరిరి. ఈ శిష్యులే బాలవీరులు కుశలవులు. త్రికాలవేదియగు వాల్మీకి వారినిగాంచి యిటులాజ్ఞాపించెను.

### వాల్మీకి

రఘుకులపురిజని రామాయణమును
బాలకులారా! పాడండి! శ్రీరామాయణమును పాడండీ!

సదమల మునిజన సదనములందు
క్షితివరసుందర శిబిరములందు
రాజమార్గముల రచ్చలయందు
మీ. పాటవిరిసి విడిబడనిండి ॥బాల॥ 1.

రసాల వని ఫలముల సేవించి
రసాలతంగొని గళములనించి

ఎడపక స్వరమేళనమొనరించి
బంధతాళ లయ పాటించండీ ॥బాల॥ 2.

నగరి జనాదరణము లభియించు
రామునికీ వార్తలు వినిపించు
స్వకథలు విన నుత్సుకత జనించు
అతడై పిలువగ నంపును పొండీ ॥బాల॥ 3.

మును సర్గక్రమమును ధ్యానించి
పాడుటలో భావము ప్రకటించి
ప్రతిదినమొక పరిమితిగ పఠించి
కథాచిత్రణకు జతనపడండి ॥బాల॥ 4.

పేరూరులనెట పేర్కొనకండి
మునిశిష్యులమేమని తెల్పండి
సస్మిత మధుర స్వరులై యుండి
సముచిత మృదుభాషలు పలకండీ ॥బాల॥ 5.

స్వయముగ వినినా శత్రుంజయుడు
అభినయముద్రల నదుపుననుంచుడు
అదికావ్యముగా దమృతార్ణవమని
రఘుకులమణి గౌరవమిడునండీ ॥బాల॥ 6.

దానదక్షిణల తాకకయుండి
ధనద్రవ్యముల గొనబోకండి
మునిజనులకు ధనమూల్యమదెంత
అకల శ్రీరామార్పితమనండి ॥బాల॥ 7.

"సంపూర్ణము"

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 2 | 4 | అశయ | ఆశయ |
| 7 | 4 | సౌఖ్మము | సౌఖ్యము |
| 8 | 9 | కాంత | శాంత |
| 9 | 15 | వంచించితి | వచించితి |
| 10 | 3 | ఆని | అని |
| 11 | 3 | అ శ్రీవిష్ణువు | ఆ శ్రీవిష్ణువు |
| 11 | 11 | నేతురు | సేతురు |
| 11 | 17 | శరథా | దశరథా |
| 14 | 3 | దినదివాళి | దినదినాభి |
| 14 | 16 | శ్యాముడ్తైన | శ్యాముడైన |
| 15 | 11 | యుక్క | యొక్క |
| 18 | 1 | యాశీర్వాద | నాశీర్వాద |
| 20 | 4 | మొనర్చెను | మొనర్చిరి |
| 22 | 12 | కళేభరము | కళేబరము |
| 22 | 20 | భపత్పద | భవత్పద |
| 24 | 25 | మయ్యెను | మయ్యెను |
| 25 | 11 | శంశర | శంకర |
| 30 | 1 | రాజ్మాభి | రాజ్యాభి |
| 30 | 4 | దీసీకి | దీనికి |
| 33 | 2 | జగిరిన | జరిగిన |
| 33 | 14 | లామెకు | లామె |
| 35 | 10 | తిల్లితో | తల్లితో |
| 39 | 16 | పీయా | నీయా |
| 39 | 16 | ఉఖియ | ఉభయ |
| 39 | 17 | ధాన | దాన |
| 40 | 1 | సుమంత్రుడు | సుమంతుడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 40 | 4 | సుమంత్రుని | సుమంతుని |
| 40 | 6 | పురుషలు | పురుషులు |
| 41 | 4 | అర్ధము | అర్థము |
| 41 | 16 | అపుము | ఆపుము |
| 41 | 19 | రాదుకొని | రాజుకొన |
| 42 | 4 | నిషధాధిపతి | నిషాదాధిపతి |
| 43 | 11 | మసము | మనము |
| 45 | 4 | వప | వన |
| 47 | 3 | కంఠద్యతో | కంఠధ్వనితో |
| 47 | 7 | సుమంత్రుడు | సుమంతుడు |
| 48 | 2 | కూహరముల | కుహరముల |
| 51 | 8 | కోల్పుదువు | కోల్పోదువు |
| 51 | 9 | కోల్పుదువు | కోల్పోదువు |
| 53 | 11 | రాఘపు | రాఘవు |
| 53 | 12 | యద్దరు | యిద్దరు |
| 53 | 17 | వనమున | వనమున |
| 56 | 2 | ఊరి | ఉర్వి |
| 57 | 3 | వియోగార్ధమే | వియోగార్థమే |
| 57 | 7 | బ్రాత | భ్రాత |
| 57 | 20 | విద్గరము | నిద్దరము |
| 58 | 11 | ప్రార్థిచెను | ప్రార్థించెను |
| 58 | 18 | డవేను | డనెను |
| 60 | 7 | కాదవ | కాదన |
| 60 | 8 | ఆయోధ్య | అయోధ్య |
| 61 | 7 | వనో | వన |
| 61 | 7 | సకలంకార | సకలాలంకార |
| 61 | 10 | ఆనురక్త | అనురక్త |
| 61 | 10 | అగ | అంగ |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 65 | 19 | విద్మ | విద్య |
| 65 | 20 | నైపుణ్య | నైపుణ్య |
| 69 | 7 | కత | కంత |
| 69 | 13 | మైధిలి | మైథిలి |
| 70 | 1 | శృగాల | సృగాల |
| 70 | 20 | దుర్వల | దుర్బల |
| 74 | 5 | జూాడ | జాడ |
| 74 | 9 | లక్షణుడు | లక్ష్మణుడు |
| 78 | 2 | పుర్తుకు | షర్తుకు |
| 83 | 19 | నిర్ధల | నిర్దల |
| 84 | 15 | వనమ్మ్మస | వనమ్మ్మన |
| 85 | 20 | ఆగాధ | అగాధ |
| 86 | 3 | అంజనేయు | ఆంజనేయు |
| 86 | 20 | మంత | సుంత |
| 87 | 12 | విఖిల | నిఖిల |
| 87 | 16 | ఆంజనేయు | ఆంజనేయు |
| 88 | 5 | ఆసహాయ | అసహాయ |
| 88 | 17 | రొహిణి | రోహిణి |
| 88 | 18 | తప్పులులలో | తప్పి పులులలో |
| 88 | 18 | నొప్నెడు | నొప్పెడు |
| 88 | 20 | స్తభించిన | స్తంభించిన |
| 90 | 14 | లంకావతి | లంకాపతి |
| 91 | 13 | సార్ధము | సార్థము |
| 92 | 5 | విధంబొంకాడ | విది బొంకాడ |
| 95 | 21 | యెరుగును | యొగురును |
| 102 | 6 | వివరి | చివరి |
| 104 | 12 | విము_క్తి | విము_క్తి |
| 106 | 15 | శ్రీరాఘుని | శ్రీరాముని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 108 | 12 | నేరుల | నేరుం |
| 109 | 2 | యెవ్వరి | ఎవ్వరి |
| 109 | 17 | వట్టి | నట్టి |
| 111 | 12 | ము ను | ముగను |
| 111 | 12 | వనుధను | వసుధను |
| 112 | 6 | మూర్చితు | మూర్ఛితు |
| 112 | 11 | వుత్రుల | పుత్రుల |
| 112 | 12 | తాసు | తాను |
| 113 | 17 | గుసీ | మగుసీ |
| 113 | 17 | బాణమ | బాణము |
| 114 | 8 | కంము | కరము |
| 114 | 19 | గసుగొనుడి | గనుగొనుడి |
| 115 | 21 | శ్రీవత్స | శ్రీవత్స |
| 116 | 22 | వద్దకు | వద్దకు |
| 119 | 19 | నెచు | నైచు |
| 120 | 7 | సాహానము | సాహసము |
| 120 | 15 | చాయను | ఛాయను |
| 121 | 17 | నలంకరించెన | నలంకరింపజేసెను |
| 122 | 2 | అమేలనము | ఆ మేళనము |
| 122 | 10 | నరయువు | నరయువు |
| 122 | 13 | స్వయవరంమటు | స్వయంవరమ్మటు |
| 123 | 15 | వదసము | వదనము |
| 124 | 16 | రాముణి | రాముని |
| 125 | 13 | భాణషము | భాషణము |
| 126 | 10 | రామభంద్రు | రామచంద్రు |
| 126 | 14 | నట్లు | నట్ల |
| 127 | 1 | కనిపించు | నగపించు |
| 128 | 6 | తెలిపెచు | తెలిపెను |
| 129 | 17 | సోవును | పోవును |

136—18